దానభారతి ప్రచురణ-౮

# నా ఋంగంటి

## (ఈసపు నీతి కథలు)

హరికథాపితామహ

శ్రీ ఆదిభట్ల నారాయణదాసు

*

సంపాదకుడు

మన్నవ గిరిధరరావు

*

ముద్రణార్థ ప్రదాతలు

Dr. కె. సదానందరావు M. B. B. S.

సదానంద నర్సింగ్‌హోమ్ చీరాల

తృతీయముద్రణ
నల వసంతము
(ఏప్రిలు, 1976)
ప్రతులు : 1000



ప్రాప్తిస్థానము
యు. సావిత్రమ్మ
C/o శ్రీ కర్రా ఈశ్వరరావు
4-2-13 చంద్రమౌళినగర్, గుంటూరు-2

వెల : 3 రూ॥లు

ముద్రణ
వెల్కమ్ ప్రెస్, ప్రైవేట్ లిమిటెడ్ గుంటూరు-2

# భూమిక

సకల కళాప్రపూర్ణుడు, మహాకవి శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణ దాస మహాశయులు ఆంధ్ర దేశమందలి ఆబాల గోపాలమునకు, పండిత పామరులకు చిరపరిచితులు. పిపీలికాది బ్రహ్మపర్యంతమువారు చుంబించని విషయములేదు. దానికి ప్రత్యక్ష సాక్ష్యములు. చిన్నపిల్లలకు నీతి గఱపుటకు సాధనమైన నూఱుగంటి మొదలుకొని, ఉద్దండ పండితులైన శాస్త్రపండితులకుకూడ అవగాహనము చేసికొనుటకు క్లిష్టమైన వారి జగజ్జ్యోతి (అష్టాదశవిద్యారహస్యము) గ్రంథమే. వారి రచనలు అన్నియు సుమారు 50 వరకు ఉండును. వానిలో అచ్చ తెలుగు కృతులుమెండు. ఈ నూఱుగంటి 100 కథలతో కూడిన చిన్నపుస్తకము సరళమైన, మెత్తని, తియ్యని తేటతెలుగులో చిన్న పిల్లలు చదువుకొనుటకై వ్రాయబడినది.

శ్రీ నారాయణదాస వర్యుల గ్రంథములన్నియు సంపూర్ణముగ విమర్శనాత్మక దృష్టితోచదివి, అనేక అముద్రితముగా నున్నవారి రచనల కన్నిటికి ప్రధాన సంపాదకత్వము బాధ్యతవహించిన ఆచార్య యస్. వి. జోగారావుగారు — నారాయణదాస గ్రంథావళి అను అనుబంధములో ఈ విధముగా ఈ పుస్తకముగురించి వ్రాసిరి. "నూఱుగంటి:— ఈసపు నీతికథల నొకనూటి నేర్చి కూర్చిన కృతి. బాలావబోధనమునకై సద్యః ప్రసన్నమగు భాషలో గద్యఘటితమైనట్టిది. ప్రతికథాంతమునందును ఒక చిన్న పద్యమున కథాంశా పురస్కృతముగ నీతి ప్రవచనము నిపుణముగ చేయబడినది. ప్రతి పద్యము సద్యోహృద్యమగు నొక సురుచిరసూక్తి. దాసుగారి నూఱింటిని నూఱు జ్ఞానచక్షువులుగా సంభావించిరి" సూక్ష్మముగా శ్రీ జోగారావుగారు నూఱుగంటి పుస్తక స్వరూపమును పై విధముగా పాఠకలోకమున కందించిరి.

ఎప్పటికైన మన బాలురకు ఇది పాఠ్యగ్రంథముగా నుంచిన బాగుండునని ఊహ పొదమి, ఈ పుస్తకము లెక్కడా దొరకనందున తృతీయముద్రణము వేయుటకు సహకరించిన నా మిత్రులు చీరాల వాస్తవ్యులు, సహృదయ శేఖరులు డాక్టరు కె. సదానందరావుగారు, శ్రీ నారాయణదాస వాఙ్మయము మీద పొడమిన భక్తిశ్రద్ధలతో, దీని ముద్రణ వ్యయము భరించుటకు ముందుకువచ్చి, దాసభారతీ ప్రచురణ సంఘమున కమితముగా తోడ్పడిరి వారికి నా మనఃపూర్వక కృతజ్ఞతాభి వందనములు. వారిని శ్రీ నారాయణదాసుగారు ఆయురారోగ్యాభివృద్ధిగా ఇట్టి సాహిత్యసేవ మున్ముందుకూడ చేయునట్లు ఆశీర్వదింతురుగాక.

నేను కోరిన వెంటనే, నా మిత్రులు శ్రీ మన్నవ గిరిధరరావుగారు, M.A., Lecturer Hindu College, ex M. L. C., యువ భారతి సంపాదకులు; శ్రీ నారాయణ దాసుగారిమీద భక్తితో నా కోరికను మన్నించి, సంపాదకులుగా వ్యవహరించి తమ అమూల్యమైన పీఠికను పాఠకలోకమున కందించిరి. అంతేగాక పుస్తకము ముద్రణ అగుచున్నపుడు, ప్రతిసారము స్వయముగా ప్రూఫులుచూచి, శ్రమఅనుకొనక, తమ అమూల్యకాలమును, శ్రీ దాససాహిత్యసేవకుకూడ వినియోగించి, వారి సాహితీ అభిరుచిని నిరూపించుకొనిరి. వారికి నా నమస్సు మనస్సులు.

మేము తలపెట్టిన దాసభారతీ ప్రచురణలన్నిటిని ఒకటొకటివెలుగులోనికి తెచ్చుచున్న Welcome Press Manging Director, శ్రీ పి. రామకృష్ణమూర్తిగారినికూడ బహుదా అభినందించుచున్నాము.

కర్రా ఈశ్వరరావు

# తొలిపలుకు

కథ అనగనే ఆబాలగోపాలము చెవికోసుకొనడం సహజం. అన్నిటిలోకి కథ చెప్పడం అత్యంత ప్రాచీనమైన కళయని విజ్ఞులయూహ. లిపి, వ్రాత, రూపొందని కాలములోగూడ వ్యక్తులు తమ అనుభవములను సన్నిహితులకు వర్ణించి వహ్వాయనిపించుకొనడం ముఖ్యవినోదముగ నుండెడిది రాజులయొద్ద కథలు చెప్పెడివారుండి తమ కథాకథనసంద్వారా ప్రీతిగొల్పెడి వారని ప్రతీతి.

కథ నీతిబోధకు ప్రధాన ఉపకరణముగ నుండెడిది. మత ప్రవక్తలు, వేదాంతులు ఉపమానాల ద్వారాను చిన్నకథలమూలమునను జనులకు క్లిష్టమగు సూత్రములను బోధక మొనర్చెడివారు. నవీనులు సహితం కథారచనకే అగ్రతాంబూలమివ్వక తప్పడంలేదు. పండిత పామరుల విరువురినీ ఆకట్టుకొనగల శక్తి కథ కున్నంతగా మరొక ప్రక్రియకులేదు

మానవునికి ఆత్మాభిమానం మెండు. తన వ్యక్తిత్వానికి భంగంకలిగించే ఏ సలహాలనుసహించడు. వీరు నాకు బోధించే వారలా అనెడి అహంకృతి అతనిని వెన్నాడుచుండుటచే హితమును సయితము స్వీకరించడు. అందుచే పోప్ నుడివినట్లు. "మనుష్యులకు బోధించుచున్నట్లు కన్పించకుండ బోధించాలి: వారు మరచిన సంగతులను గుర్తుచేయుచున్నట్లుండవలె". [Men must be taught as if you taught them not. And things unknown propossed as things forgotten. —Pope]

నీతిబోధన, సత్యప్రకటనలు తరచు శత్రువులను కొనితెస్తాయి. బోధకుడు నిర్మలచరితుడు కావలె. ఐనను అతనికి నిందలు సంకటములు తప్పవు. సోక్రటీసు పడినపాట్లు ఇందుకొక తార్కాణము.

ఇట్లు విపత్తులను మీదవేసుకొనుటకు బదులు పశుపక్ష్యాదులను పాత్రలనుజేసి వాటి జీవితములో సంఘటనలనూహించి, వాటిచే సమయోచితముగ మాట్లాడించు ప్రక్రియ ఏంతయో సహాయకారి. మానవునిలోగల గుణములే జంతుజాలములోగూడ నున్నాయి. సింహము రాజసమునకు, నక్కకాపట్యానికి, శునకము విశ్వాసానికి, గాడిదమూర్ఖతకు, మేక అమాయకత్వానికి, ఎద్దు కాయకష్టానికి, తాబేలు మాంద్యానికి ప్రతీకలుగ నిలుస్తాయి. ఆయాప్రవృత్తులకు దగినట్లు వాటిచే సంభాషింపజేసి కథలనల్లుట, ఆ కథలలో అప్రకటితముగ నీతిని స్ఫురింపజేయుట దేశదేశాలలో పలువురు చేపట్టిన కథావిధానము.

క్రీస్తుశకము నాలుగవశతాబ్దములో మహాపండితుడు విష్ణుశర్మ మూఢులగు రాకుమారులను వివేకవంతులుగ తీర్చిదిద్దుటకై పంచతంత్రమును వెలయించినాడు. అది సమగ్రము సుదీర్ఘమునగు నైదుకథల సంపుటి. అందు పశుపక్ష్యాదులే పాత్రలు. ప్రతికథలోను అనేక పిట్టకథలు జొప్పించబడి ప్రధానకథకు అలంకారము గూర్చినవి. భారతీయ సంస్కృతి పక్షమున రాయబారిగా ఖండఖండాంతరములు ప్రయాణించినది పంచతంత్రము.

పిట్టకథకు తొలిపేరు పిటకకథ యట. బౌద్ధమతగ్రంథములగు వినయపిటకము, సుత్తపిటకము, అభిధమ్మపిటకములలో రెండవదియగు సుత్తపిటకములో సిద్ధార్థుని పూర్వజన్మవృత్తాంతములకు సంబంధించిన గాథలున్నవి. వీనికే జాతకకథలని పేరు. ఇందలి పాత్రలన్నియు నధికముగ పశుపక్ష్యాదులే. వీటినుండి పిటకకథయను పేరు వచ్చియుండునని, అది పిట్టకథయైనదని యొక అభిప్రాయము. ఈ జాతకకథలు క్రీస్తుపూర్వం 4వ శతాబ్దమునాటివి.

గ్రీస్తుదేశములో ఈసప్ అనునతడు (క్రీ.పూ. 620-560) సామోస్ రాజుకడ బానిసగనుండి క్రమముగ రాజున కాంతరంగికుడైనాడు. రాజునకు కథలు చెప్పి ఆనందపరచేవాడు.

ఒకనాడు ఈసప్ ఏథెన్సు నగరమునకు వెళ్ళాడు. అచటి జనులు వారి రాజగు పీసిస్ట్రాటస్‌ను తొలగించి మరొక ప్రభువును ఏర్పరచుకొనదలచగా, ఈసప్ వారికి "కప్పలు రాజుకొరకై దేవుని అర్థించుట"యను కథచెప్పాడు. రానున్న రాజు వారిని భక్షించునేమోగనుక ఉన్నవానితోనే సర్దుకొని పోవలెనని సూచించినాడు.

ఈసప్ గూడ పశుపక్ష్యాదులతోనే కథ అల్లినాడు ఆతడు చెప్పిన కథలు ఐరోపాలో నీతికథా సారస్వతంలో విశిష్ఠస్థానమునలంకరించాయి. క్రీ. పూ. 345-283 నకుచెందిన డెమిట్రియస్ ఈసప్ కథలన గ్రంథస్థం చేసినాడు. మూడవ శతాబ్ధములో ఇటలీకి చెందిన బ్రిబియస్ వాటిని లాటిన్ భాషలోనికి అనువదించాడు. క్రమముగా ఫ్రెంచి జర్మన్ భాషల్లో గూడ వెలువడినాయి. పలువురిచేతుల్లో పడి కొన్ని కథలు అదనంగాచేరాయి. 1889 లో ఆగ్లంలో జె. జేకబ్ ఈసప్ కథలు ప్రచురించాడు. ఆదిలో 100 కథలుండగా నాటికవి 313 వరకు పెరిగినవి.

భారతదేశములో ఆంగ్లభాషా బోధన ప్రవేశపెట్టబడిన తొలి దినములలో ఈసప్ కథలు మిక్కిలి ప్రచారం పొందాయి ప్రతివిద్యార్థియు వీటి నాంగ్లములో చదివి యానందించెడివాడు. 1893 లో శ్రీకందుకూరి వీరేశలింగంగారు "నీతికథామంజరి" యను పేర వీటి నాంధ్రీకరించి ప్రచురించారు. అందు 158 కథలను పేర్కొనినారు. ప్రతి కథ యొక్క నీతిని గీతపద్యంలో వెలువరించారు.

శ్రీ మదజ్జాడాదిబొట్ల నారాయణదాసుగారు ఈసప్ కథలలో నూరిం టిని గైకొని "నూఱుగంటి"గా వెలువరచినారు. ద్వితీయముద్రణము 1930లో వెలువడినది. ప్రతికథాంతమున నీతిని తేటగీతలలో వెలయించి నారు. దాసుగారు తమ గ్రంథమునకు "వివరము" వ్రాయుచు "జగ మంతట విన్నగులఁ దెలివిగలవారిచేత నెన్నికకెక్కి యడుగడుగునకు మంచితెలిపెడి యీ ముచ్చటలు వందలకొలఁది మూడునాలుగు వేల యేండ్లక్రిందట నొక వడమటి నాటు చదువరి మిన్నపన్నెను" అన్నారు. వారు ఈసప్ పేరు పేర్కొనలేదు. ఇవి యొక్క గ్రీసుదేశమునకు చెందినవి గానవీ పలుపురి శ్రమఫలితమని వారి భావము గావచ్చు.

కందుకూరి వీరేశలింగంగారు వ్రాసిన 158 కథలలో దాసుగారు పేర్కొనిన 100 కథలుగూడ ఉన్నవి. శీర్షికలలో మాత్రము తేడా యున్నది. ఇరువురును కథలచివర నీతులను పద్యములలో వెల్లడించి నారు.

"వానకోయిల, దానిపిల్లలు" అను దాసుగారి నూఱుగంటి లోని 28వ కథ వీరేశలింగంగారి నీతికథామంజరిలో 27వ కథ "భరత పక్షి, దానిపిల్లలు" పేరకన్పించుచున్నది. పొలములో గూడు కట్టుకొని పక్షి పిల్లలతో నివసించుచుండగా రైతు పంటకోయుటకై మొదటి నాడు కూలి వాండ్రను పిలువదలచినాడు. వారురారు; రెండవ దినమున బంధువులను పిలువదలచినాడు. వారుగూడరారు. పిల్లలీవిషయము తల్లిపిట్టకెరిగించగా ఇప్పట్లో నివాసము మార్చనవసరములేదని అంటుంది. మూడవనాడు రైతు తానేకుమారులతో గలసి కోతకోయుటకు రాదలచగా, పక్షిపిల్లలతో గలసి పొలము విడిచిపోవడం ఇందలికథ. కథయొక్క నీతిని ఇరువురు గ్రంథ కర్తలిట్లు పేర్కొనినారు;

శ్రీ దాసుగారు :

> తనకుఁ జేతనైన తనపని యొరులపై
> మోపువాఁడు తుదకు మోసపోవు
> చేసికోక పనిని జేయఁ జాట్టములపైఁ
> బెట్టుఁ గాపువాఁడు నెట్టుకొనునె.

శ్రీ వీరేశలింగంగారు :

> పనిని జక్కఁగ నొనరింప వలయునన్న
> స్వయముగాఁదానె చేసికోవలయు నెపుడు
> కార్యమును దానె చేసికోగలుగునేని
> పరుల సాహాయ్యమున కాశపడఁగఁ దగదు.

శ్రీ ఆదిభొట్ల నారాయణదాసుగారు తమ గ్రంధములో నచ్చతెలుగు నకు సర్వోన్నత స్థానమిచ్చినారు. ఇందలి ప్రత్యేకత యిది.

వీరిరువురేగాక శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు వ్యావహారిక భాషలో "ఈసప్ కథలు" రచించగా శ్రీ కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్ రాజమండ్రివారు 1957లో మొదటి ముద్రణచేశారు. అందు 316 కథలున్నాయి. కథలచివర నీతులు పేర్కొనబడలేదు. "నీతి చెప్పవల సింది కథేగాని కథకుడుకాడు. శ్రోతగాని చదువరిగాని కథా సందంలో ఉంటూన్న సమయంలో నీతిబోధయొక్క వాసన కొట్టకుండా ఉండడమే నయం" అంటారు భమిడిపాటివారు.

"ఈసప్ నీతికథలను బౌద్ధజాతక కథలను ఒండొంటితో బోల్చి పరి శీలించినచో ననేకకథ లించుగానొకటి గానే కనబడును. యూరోపు హిందూ దేశములలోని నీతికథలను బరస్పరము బోల్చి పరిశోధింన పరిశోధన పం డితులు ఈసప్ నీతికథలలో ననేకములు హిందూదేశము నుంచి యూరో

పుకు వెళ్లనవేయని నిర్ధరించియున్నారు" అని శ్రీమల్లంపల్లిసోమశేఖరశర్మ గారు నీతికథామంజరి పీఠికలో పేర్కొన్నారు.

ఏదేశమునుండి ఎవరు గ్రహించినను ఈకథలు సర్వకాలములలో బుద్ధిమంతులు గ్రహించి ప్రయోజనము పొంద దగియున్నవి. తెలుగునాడు లోని బాలబాలికలు తప్పకచదివి ఉత్సాహము పొందదగినవి. ఒక్కొక్క కథ పాఠకుని కొక్కొక్క నయనము వలె-నుపకరించి పుస్తకము తుది వరకు చదివి, మూడుకన్నులు గలిగినంతటి వివేకము పొందగలడని గ్రథకర్తయాకాంక్ష

ఆంధ్ర సారస్వత లోకంలో పుంరూప సరస్వతి యని పేరొంది, ఆట పాట మాట మీటల మేటిగా ప్రసిద్ధి జెందిన స్వర్గీయ ఆదిభొట్ల నారాయణ దాసుగారి రచనల నన్నిటిని మరల ముద్రింపజేయుచున్న సాహిత్యారాధకులు శ్రీ కళ్ళా ఈశ్వరరావుగారి కృషి అసాధారణమైనది. వారికి నా అభినందనలు !

లెక్చరర్, హిందూకాలేజి
గుంటూరు—3
నల - ఉగాది

మన్నవ గిరిధరరావు
సంపాదకుడు "యువభారతి" మాసపత్రిక



"ఒకపండితోద్దండుఁడొక యోద్ధ
ఒక మహాసమ్రాట్టు నొకమహర్షి" — యస్వీ.

# వివరము

జగమంతటన్మిగులఁ దెలివిగలవారిచేత నెన్నిక కెక్కి-
యడుగడుగునకు మంచి తెలిపెడి యీముచ్చటలు వందలకొలఁది
మూఁడునాల్గు వేలయేండ్ల క్రిందట నొకపడమటినాటు చదువరి
మిన్నపన్నెను. మేల్మివలె మెత్తనైన తెలుఁగునందీ సామెతలున్న
యెడల మఱింతవన్నె కెక్కునని యెంచి నూటేర్చి కూర్చి
నాఁడను ఇదివఱకుఁదెలుఁగు మాటలల్లు వారిలోఁగొందఱు దయ్యా
పునడి కేతల విఱిచితమకుఁదోఁచినట్లెల్ల వ్రాయుచుండిరి మఱి
కొందఱావేల్పు పల్కులకుఁ దెనుఁగునుడుల మూసికవేసి వేఱి
కొకనికి నేర్పుకొన్న పిమ్మట దెలిసికొనఁ జాలునట్లు వ్రాసిరికాని
యొక్కరైన వేల్పుమాటలెచ్చటఁ గూర్చవలయునో యవి యెం
తవఱకుఁ గావలయునో తెనుఁగెట్లు చెప్పి నప్పుడందఱికిం దేఁట
తెల్లము కాఁగలదో యాతీరు సరిగా గుఱుతించినట్లగపడదు.
వేల్పుమాటలకుఁ దెలుఁగ స్తరవంటించుటకుఁ దప్ప మఱెందు
నకుం బనికిరాదనియో లేకొక్కతేఁట తెనుఁగుననే మాటలు
కూర్చినప్పుడందఱికిఁ దెలియవీలు కాదనియో యేమేమో వారి
వారి తలంపై యుండవచ్చును. అద్దిరా తెలుఁగునఁ గొంత
యెద్దిరా బంగరు పళ్ళెరమునకైన గోడచేర్పున్నట్లు వేల్పున
డితో నొకప్పుడదిచేరినఁ జేరనీ

ఆటవెలఁది॥ మొలకలేఁతదనము । తలిరులనవకము।
మొగ్గసోగతనము । పూవుతావి।
తేనెతీయదనము । తెఁనుగునకేకాని।
మోటుఁలాతినాటు । మాటకేది॥

ఇట్టి ముద్దులమూటఁగట్టు తేఁట తెనుఁగునరకు గొనం బనక వాఁడుకతప్పి వాడియున్నందున విద్దాని బాగు తెలుఁగు నాటి వారందఱునొగ్గొఁదగినది,

ఆటవెలఁది॥ మాఱుకమలవాని । తీరువఁదెల్పితో।
దీనిఁజదువువారు । తిరుగుమంద్రు।
మాఱుగంటియ నెడి । పేరుదీనికిఁదగి।
యుండవిదియుఁబెంపు । నొందుచుండు॥

ఆదిభొట్ల నారాయణదాసు.

# నూఱుగంటి

## 1. కోడిపుంజు, ఱవ

ఒక కోడిపుంజు కాళ్ళతోఁ బెంటను దువ్వి గింజలేరి తినుచుండఁగా దానికొక ఱవ దొరకెను. దానిని జూచి యా పుంజు ఱెక్కలు విదల్చుచు "ఓ రాయీ! నీవందముగా నున్నావు కాని, నీవంటి వెన్నిమానికలైన నొక బియ్యపుగింజపాటి కానేరవు కదా" అని తలయెత్తి కూసెను.

గీ॥ తనకు దొరకినట్టి • దాని మేలెఱుఁగక
పనికిరానిదనుచుఁ • బలుకు, జెనఁటి
పెంటపైనికోడి • పెద్దఱవం జూచి
విలువకానిదనుచుఁ దెలుపలేదె.

## 2. తోఁడేలు, గొఱ్ఱెపిల్ల

ఒక మండు వేసవి యెండపొద్దున దప్పితీర్చుకొనుటకై కొండ కాలువకొక తోడేలు పోయెను. తోడేలునకుఁ గ్రింది వైపుగా నొక గొఱ్ఱెపిల్ల కూడ నీళ్లు త్రాగుచుండెను. అది చూచి తోఁడేలు గొఱ్ఱెపిల్లపై గన్నులెఱ్ఱజేసి "ఏమి యాత్రుళ్ళుపాటు; కనులగపడవా, నీళ్ళెందుకు కలఁచుచున్నావు! నీకింత పొగరమా" అనెను. అందుకా గొఱ్ఱెపిల్ల కనికరము వడవడ వణఁకుచు "నేనా నీటిని గలఁచుచున్నాను! నాయొద్దనుండి నీరు

నీపై నునకెట్టుపాఱును! నేను గాలువకుదిగువఁగదా యున్నాను!"
అనిపల్కెను. ఆమాటలకుఁ దోఁడేలు లేనిపోని యలుకఁ దెచ్చు
కొని మండిపడుచుఁ జూడు నీపని పట్టించెదను. ఆఱునెలల
క్రిందట నీవు నన్నెందుకు వెక్కిరించినావు!" అని గద్దించెను.
అది విని 'అయ్యో! నేనప్పటికిఁ బుట్టనేలేదే" అని గొఱ్ఱెపిల్ల
వెక్కివెక్కి యేడ్చెను. గాని యామొఱ్ఱఁ బెడచెవులఁబెట్టి యా
తోఁడేలు మూతి బిగించి గొఱ్ఱెపిల్ల యొద్ద కొక్క గంతు వేసి
"నీవు కాకున్న నీతల్లి నన్నప్పుడీసడించినది. ఎవరైన నొకటే"
అని యాగొఱ్ఱెపిల్లను ముక్కముక్కలుగాఁ గొఱికి తినెను.

గీ॥ లేని నేరముఁ దాఁబన్ని • యైనఁ జెడ్డ
వాడు లోఁకువవానికిఁ • గీడుసేయు
నేదియో లేనిపోని త • ప్పెంచియెంచి
గొఱ్ఱెపిల్లను దోఁడేలు • కొఱుకలేదె.

## ౨. దొరనుగోరిన కప్పలు.

ఒకప్పు డొక చెఱువులోని కప్పలన్నియుఁ జెలగాట
మాడుచుఁ దమకొక రాజునిమ్మని తమ యిలవేల్పును వేఁడు
కొనెను. అందుకావేల్పు నవ్వి నవ్వులాటకా చెఱ్వులో నొక
కఱ్ఱమొద్దును పడవేసెను. దానిని జూచి కప్పలన్నియు మొదట
నదరి పిమ్మట మెల్లిమెల్లఁగా నొకదానివెంట నొకటి చేరఁబాఱి
యా మొద్దును గదల్పసాగెను. అది కదలకుండుటఁ జూచి
"ఓహో! బాగుబాగు! ఎంతకదల్చినను గదలదు మెదలదు;

ఈ మొద్దు మనకెందుకు" అని నవ్వుకొని తిరిగి వేల్పుతో 'వట్టి మొద్దునా మాకు రాజుచేసినావు! కదలికఁగల రాజును బంపరాదా!" అని మనవిచేసికొనెను. అందుకావేల్పలుకతో నక్కడికొక కొంగనంపెను. ఆకొంగ మిగులఁ గదలికతో చెర్వులోని కప్పల నొక్కటొక్కటిగ మ్రింగుచుండెను, అది చూచి కప్పలన్నియును "అయ్యో! కోరి ముప్పుదెచ్చుకొంటిమి కదా" అని వగవసాగెను.

గీ॥ కీడుసేయనట్టి • వాఁడు రాజయియుండ
వానిమార్పఁగోర • వచ్చుఁజేటు
కట్టెమొద్దురాజు • గానేరఁడనిమార్పఁ
గోరి కప్పలిడుముఁ • గొనఁగలేదె.

## 4. మాలకాకి

ఒకప్పుడొక మాలకాకి పిట్టలకు రాజుగా నుండఁగోరి, నెమలిఁ చిలుక, గోర, కోయిల మొదలగువాని ఱెక్క లెరవు పెట్టుకొనెను. అప్పుడా మాలకాకి యన్నిపిట్టలకన్న మిక్కిలి చక్కఁగా నుండెను. అదిచూచి తక్కినపిట్టలన్నియుఁ దమలోఁ దాము "ఆహా! ఇప్పటివఱకును నెమలియే మిక్కిలి చక్కనిదని యెంచి మనమందఱము దానిని రాజుచేసికొంటిమిగాని నెమలి కంటె నూఱింత లిది చక్కనిదిగదా. దీనినే యింతటినుండి రాజుగాఁ గొలుచుకొందము" అని యెరవు సొగసుతోనున్న మాల కాకిని గొలువఁజొచ్చెను. అంతట నొకనాఁడు వింతవింత రక

ముల పులుఁగులు తనచెంతఁ గొలుచుచుండ విందుకొలువై యున్న మాలకాకిదొరయొద్దకొక యూరకాకివచ్చి "ఓహో! బోడికి బొందు మల్లెలు! ఏమీ యీవింత! ఈ పాడు మాలకాకి కెంతఅదృష్టము పట్టెను! కానీ, దీని బండారము బయలు పెట్టెదను," అని కావునఁ గూసెను. ఆకూఁతవిని మాలకాకి కూడ నొడలు మఱచి కూయ సాగెను. ఆ సొంపుఁజూచి పిట్టలన్నియుఁ "ఔలఁ ఔలు మాల కాకినా. మనకు రాజు చేసికొంటిమి" అని దేని మట్టునకది మాల కాకిపైనుండి తమ వెంట్రుక లూడలాగు కొనెను. అప్పుడామాల కాకి చిన్నఁబోయి "ఎరవుసొమ్ము బరువగుటయేగాక పరువుఁగూడఁ దీసెనుగదా" అని వగచుచుఁ బోయెను.

గీ॥ లేనిసొగసుఁజూపఁ • బూనియెరవుసొమ్ము
మోయువానిపరువు • మొదలుపోవు
తెక్కలెరవుదెచ్చి • చక్కఁదనముఁజూపు
మాలకాకియవ్వ • పాలుగాదె.

## ౫. కుక్క, దాని నీడ

ఒకకుక్క నోటితో రొట్టెముక్కను గఱచుకొని యొక చిన్న యేటికాలువ నీదుచు దాటుచుండెను. అప్పుడాకుక్క నీటి లోఁ దన నీడఁజూచి "ఇదికూడ నావలె రొట్టెను గఱచుకొని నాతో సరిగా నీఁదుచున్నది, దీని పటిపట్టించి దీని రొట్టెకూడఁ దీసికొనెదను" అని నోరుదెఱచి తననీడను గఱవఁబోయెను. అంతట దానినోటిలోని రొట్టె లోఁతునీటిలోఁ బడిపోయెను. పిమ్మట

నాకుక్క "ఆహా పేరాసమొదలు చెఱిచెను గదా" అని మొరు గుచుఁ బోయెను.

గీ॥ తనకుఁగలకొలందిఁ • దనియకొరులదాని
కాసచేయువాఁడు • మోసఁబోవు
లేఁడుపీదరొట్టె • కూడ మ్రింగఁగడంగు
కుక్కనోటిరొట్టెఁ • గోలుపోదె.

## 6. సింగము, కొంకనక్కలు

ఒకప్పుడొక సింగముతో నాలుగు కొంగనక్కలు నేస్తము గట్టుకొనెను. అంతట నొకనాఁడానక్కలొకక్రొవ్విన దుప్పిని జంపి తెచ్చెను. దానిని సింగము రెండువంతులు వేసి నక్కలను జూచి "వింటిరా మీలో నేను బెద్ద వాఁడను గనుక విందులో నొకవంతునాది; తక్కినది మనలో నెక్కువ యెవఁడో వానిది" అని పల్కెను. అదివిని కొంగనక్కలు "ఔను, నీ యొద్దనుండి వప్పుడు మాకొక్క కట్టకడవంతే, నీకుఁ దెలియని దేమికలదు" అని పాఱిపోయెను.

గీ॥ అలఁతివానికి బలువుని • చెలిమిమొదల
దొడ్డగామన్నఁదుదకది • చెడ్డపేయు
నక్కలకు ముందుసింగఁపు • మక్కువకదు
మేటియైనను గడకది • చేటుగాదె.

## 7, వఱడు, కొంగ

ఒకవఱడు చచ్చినయెద్దును గొఱికి తినుచుండెను. అప్పుడు దానిగొంతులో నొకయెముక యడ్డము పడెను. ఆ నొప్పితో వఱ డూలఁబోయఁ జొచ్చెను. అంతలో నొక కొంగ తనవైపునకు వచ్చుటచూచి వఱడు "అయ్యా! యెముక యడ్డుపడినది. నొప్పి యోర్చుకొనిన కొలఁదిఁ పెరుఁగుచున్నది. నన్నుఁ జూడుమా; ఊపిరి దీయలేకున్నాను. నామొఱ్ఱ గొంచెము వినుమా. దీనిని బైకితీసెదవేని నీకెంత మేలు చేసెదనో యిప్పుడేమి చెప్పగలను" అని వేఁడెను. అందుకా కొంగయొప్పి తనగొంతు నా వఱడు నోటిలోపలికిఁ జాఁచి ముక్కుతో నెముకను బెఱికివేసి "ఏదీ నాకుఁ జేసెదనన్న మేలు" అని యడిగెను. అప్పుడు "ఏమోయీ యింత వెఱ్ఱివాఁడవు, నానోటిలో నీవు కుత్తుకఁ జాచినప్పుడు కటక్కున నీగొంతు గొఱుకక మానుట నీకు గొప్పమేలుకాదా!" అని పలికెను. అదివిని కొంగ జడిసి "నా తలదక్కుట నాకదేపదివేలు" అని యెగిరిపోయెను.

గీ॥ చెనటికొఱకు మంచి చేసినవానికిఁ
చేటుగలుగకుంట • మేటిమేలు
గొంతువఱడునోట • కొంగ దాముంచిన
గొంతుదక్కియుంట • గొప్పకాదె.

## 8. దుప్పిపోతు, నీడ

ఒక దుప్పిపోతు నీటిలోఁ దననీడను జూచుకొనుచు "ఆహా నా మొగమెంత బాగుగానున్నది. నా పై మచ్చలెంతయందమైనవి, ఇంత నా సొగసునకు వన్నెఁ దెచ్చి చిగిళ్లు పట్టినవి నా కొమ్మలే కదా? నాకన్నియు జక్కఁగా నున్నవికాని కాళ్లు తీరైనవి కావు. కొమ్మల చక్కఁదనము కాళ్లకుంటెరా నాయంత చక్కనిదేది? అని యనుకొనుచు డొంకల కెదురుగఁ బోవుచుండెను. అంతట దాని వెనుక వేఁటకుక్కలు తఱుముకొని వచ్చుట జూఁచి యా దుప్పిపోతు డొంకల నడుమఁ బడి తెమలలేక, "అయ్యయ్యో డొంకలమండి నన్ను నా కాళ్ళు తప్పించుచున్నవి కాని కొమ్మలేగా నన్నుఁ గుక్కలకుఁ బట్టి యిచ్చుచున్నవి" అని యేడ్చెను.

గీ। బాగు పేయువానిఁ • బరికింపకిదుముల
కిడెడుదానిమెచ్చు • వెదగుచెడును
తన్ను గాఁచు కాళ్ళ • నెన్నకకొమ్మల
నెన్నివట్టి • దుప్పి • తిన్నఁబడెనె.

## 9. కాకి, నక్క

ఒక కాకి జున్నుగడ్డను గఱచుకొని చెట్టుకొమ్మపై వ్రాలెను. అదిచూచి యొక నక్క యాజున్ను తనకెట్లు చిక్కునని తలంచి కొమ్మకిందఁ నిలఁబడి మొగమెత్తి "ఓహో!

పిల్లల నెన్నింటినో చూచితినిగాని నీయంత చక్కనిదేదీ! నీ రంగెంత బాగుగానున్నది. నీకనుముక్కులతీరడుగనేల? విన్నందుకుఁ జూచినందు కొక్కలాగున్నది. కాని నాదొక్క కోరిక! నీ పాట ముద్దులమూటఁ గట్టుచుండునంట చెవులార వినుట యెన్నఁడో! ఒకమాఱు నాకోర్కెఁ జెల్లింపవా!" అని వేఁడెను. అది విని యుప్పొంగి కాకి నోరుఁదెఱచి కాయని యఱచెను. అంతట దాని నోటి జున్నుగడ్డ జాఱి క్రిందఁబడెను. అందుకై కనిపెట్టుకొన్న నక్క దాని నందుకొని "ఓహోహో కాకీ నీ సొంపునకుఁ దోడు పాటయెందుకు!" అని పాఱిపోయెను. అదివిని కాకి సిగ్గుపడి "అయ్యో నక్కమాటలకుబ్బి నానోటి జున్నుఁ బోగొట్టుకొంటిని గదా!" అని వగచెను.

గీ॥ తన్నొకఁడు కొంచె • తనమున బొగడిన
బొంగువట్టివాడు • మోసపోవు
నక్కచేయు మెప్పు • నకు గాకిపాటకై
గొంతుఁదెఱచి జున్ను • గోలుపోదె.

## 10. రెండాఁడు కుక్కలు.

ఒకయాఁడుకుక్క యీఁదు చూలుతోనుండి మఱియొక యాఁడుకుక్కవద్దకుఁ బోయి "అమ్మా నొప్పులుపడుచున్నాను. పురుడువచ్చిన వెంటనే యింకొక చోటికిఁ బోయెదను. అంత వఱకు నీయిల్లిచ్చెదవా!" అని యడిగెను. అందుకు రెండవకుక్క "సరే. నీవు నీళ్ళాడిన వెంటనే నాయిల్లు నాకిచ్చివేయవలెను.

జమా” అని యొప్పించి మఱియొక చోటికిఁబోయెను. ఆచూలు కుక్క మఱునాఁడే యీవి నాలుగు పోతుకూనలను బెట్టెను. అది విని రెండవకుక్క, పిల్లలకుక్క యొద్దకువచ్చి “ఇఁక నాతావు నాకిచ్చివేయుము. నే నెన్నాళ్లు నాయిల్లువిడిచి యుండఁగలను. నేనుఁగూడ నెలతప్పినట్లు తోఁచుచున్నది” అని యడిగెను. అందుకు “అయ్యో! ఇప్పుడేకదా నీళ్ళాడినాను. నావంటి పచ్చి బాలింతరాలిని వెడలఁగొట్టెదవా; చూడు. నా పిల్లలకుఁ గనులే పీడలేదు. ఇట్టికందులతో నే నెక్కడికిఁ బోఁగలను. నా తల్లి నాతల్లి! నిన్ను బతిమాలుకొనెదను. ఈచంటికూనలనైనఁ గనికరించి మఱియొక నెలవఱ కిక్కడ నుండనిమ్ము. నీ మేలు మఱచెదనా” అని వేడుకొనెను. పిల్లలపైని గనికరపడి యారెండవ కుక్క యందుకొప్పుకొనెను పిమ్మటఁ గొన్నాళ్లకాపోతుకూనలు తల్లిపాలుఁ ద్రాగి క్రొవ్వి గునగునలాడుచుఁ జెర్లాడుచుండెను. అంతట నిల్లుగల కుక్కవచ్చి “నీవుకోరిన నెలమించినది, ఇంకనైన నాయిల్లు విడిచెదవా!” అని యడిగెను. అదివిని యాపిల్లలకుక్క “చాలుఁజాలు నీ కెక్కడియిల్లు ఇంకొకతూరి యిక్కడికివచ్చితి వేనిఁ జూడు నా పోతుకూనల నసిఁకొల్పెదను” అని కసరెను.తరువాత రెండవకుక్క “అహా తన్నుమాలిన యీవిమొదలు చెఱిచెమగదా” అని రోఁజుచుఁ బోయెను.

గీ॥ ఉన్నపొమ్మెల్ల నొరునకు, నొప్పగించి
　నమ్ముకొనువాఁడు తుదకుమో, సమ్ముఁగనును

పిచ్చివమ్మకతో వెర • విచ్చియున్క
వద్బెడలు కుక్క మొదలు వోc • గొట్టుకొవదె.

## 11 పొగరుబోతు కప్ప

ఒక యెద్దు మెరకపై మేయుచుండ దానికాలు క్రిందబడి యొక కప్పపిల్ల చితికిపోయెను. అదిచూచి తక్కిన కప్పపిల్లలు తమతల్లియొద్దకుఁబోయి "అమ్మా వింటివా! నేఁడొక పెద్ద వింత జరిగెను. మాలో నొకకప్పపిల్ల యొకదానికాలు క్రిందఁబడి చచ్చి పోయెను. అంతపెద్దదాని నేనెన్నఁడును జూడలేదు." అనిచెప్పుట విని యాకప్ప కడుపుబ్బించి "అది యింతకన్నఁ బెద్దదిగానుం డెనా!" అని యడిగెను. అందుకా పిల్లలు "అమ్మా యెన్నియింతలో నీ కన్ననది పెద్దది" అనిరి. అదివిని యా కప్ప మఱింత పెద్దది కాఁబోయి కడుపువిచ్చి చచ్చెను.

గీ॥ తకులేవిగొవ్వఁ • దవముఁజూవఁగఁబోయి
చేతకానివాఁడు • చేటుఁబొందు
ఎద్దువలెను దాను • పెద్దదికాఁబోయి
కడుపువిచ్చికప్ప • మడిపివోదె.

## 12. నక్క, కొంగ

ఒకప్పుడొకకొంగతో నక్క నేస్తముగట్టుకొని దానిని దనయింటికి విందునకై పిలిచెను. ఆనక్క సిబ్బిలోఁ దిమ్మనము పోసి కొంగను|దాగుమని తానుంగూడ దెబ్బనవాకఁజొచ్చెను.

కొంగముక్కునకుఁ గొంచెమైనను దిమ్మనము రాకుండెనుగాని చిటికలోనే నక్క తననాలుకతోఁ దిమ్మనము కపింతయునిమ్మి గులనీక జుఱ్ఱివేసెను. మఱికొన్నాళ్ళకా కొంగ నక్కను విందునకుఁ బిలిచి యొకసన్నఁపు మూతిబుడ్డిలోఁ దేనెనుబోసి ముందు పెట్టి పీల్చుమని తనముక్కు దానిలోఁదూర్చి తేనెను వల్లనైనంత తొందఱతోఁ బీల్చుచుండెను. నక్కకు మూతిబుడ్డిలోఁ దూరకుండుటచేఁ కొంగముక్కునుండి రాలినబొట్లు నాకుటతప్ప మఱేమియు దొరకలేదు. అదిచూచి నక్క "ఒకనికి మించిన టక్కరి యొకఁడుండును గదా? నాకుఁదగినట్లు చేసినావు" అని చెప్పి పాఱిపోయెను.

గీ॥ తానెటక్కరియనుచుఁ బై • వానిమోస
పుచ్చెడు నతండుఁబదులుగ • మోసఁబోవు
కొంగయెడఁ దక్కరితనంబుఁ • గావిన నక్క
బదులుగా దానిచే మోస • పడఁగలేదె.

## 18. డేగ, గుంటనక్క

ఒకడేగ తనపిల్లను మేపఁగోరి యొక గుంటనక్కపిల్లను దన్నుకొనివచ్చుచుండెను. అదిచూచి తల్లినక్క యాడేగ వెంటబడి "అయ్యా! నా పిల్లను జంపివేయకు; నాకిది యొక్కటియే పిల్ల; నా పిల్లను నాకిచ్చి వేయుము" అని మొఱ్ఱపెట్టెను. కాని, డేగ యామాటలను బెడచెవులఁబెట్టి తనగూటిలోనికి బాఱిపో

యెను. అంతట నక్క యొక కొఱవిని నోటఁగఱచుకొని యా డేగ గూడున్న చెట్టుపై కెక్కుచుండెను. అదిచూచి డేగ "అయ్యో నా జోలికిరాకు. నీ పిల్ల యిదిగో" అని నక్కకు దానిపిల్ల నప్ప గించెను.

గీ॥ తనకుఁజెఱుపు చేయు • చెనఁటికివేర్పన
వాఁడుమాఱుచేసి • కీడుదాటు
తనమచిఱతనె త్తి • చనుడేగగూటికి
విప్పుఁజూపినక్క • నెమ్మిఁగనదె.

## 14. గాడిదె, ఎలుఁగుబంటి

ఒక గాడిదె పొలములో మేయుచు నవ్వులాటకై యొక యెలుఁగుబంటిని జూచి "అయ్యగారూ! బాగున్నారా" అని యెక సక్కెముగాఁబల్కెను. అదివిని యెలుగుబంటి "ఓహో యెక సక్కెమాడుచున్నావా! ఎంతపోతరించినావు. నాతో నీకు నవ్వులా! నీకుఁదగినట్లు చేయుదునుగాని నిన్ను ముట్టుకొనుట కూడ నా పరువునకుఁ దక్కువ. పోపో ఇంకనైన నొడలు తెలిసికొని యుండుము" అని గదిమెను.

గీ॥ చెనఁటితను నెకసక్కెంబు • చేయఁదగిన
పెద్దయలుగక వానికి • బుద్ధిచెప్పు
వేడ్క నెలుగుబంటినిగాడ్దె • వెక్కిరింప
పైఁబియంతరు వెఱిఁగించి • చనఁగలేదె.

## 15. తంపర కప్పలు, దీకొన్న యాఁబోతులు

ఒక తంపరబీడులో నొకకప్ప తక్కినకప్పలను జూచి "చూచితిరా, యారెండాఁబోతు లెట్లు పోట్లాడుచున్నవో! ఇంక మనపనియేమి కాఁగలదోకదా నాకేమియుఁదోఁచదు" అని గడ గడ వడఁకుచుఁ జెప్పెను. అందుకా కప్పలన్నియు "ఓ వెఱ్ఱి వాఁడా, అవునుందూడ యుండగాఁ నడుమగుఁజ యఱచెనన్నట్లు నీవడఁకెందుకు. ఆ యాఁబోతులతో మనకేమిపని యూరకుం డుము" అనెను. ఆమాటలువిని యాకప్ప "అయ్యో దీనికిటుకు మీకుఁ దెలియదా? ఈ రెండాఁబోతులలో గెలిచినది యా యగ పడుచున్న యాలమందకుఁ బెద్దయగును. వీఁగినది మనతంపర లోనికిఁ దఱుమఁగొట్టఁబడును. అప్పుడు దాని కాళ్ళక్రింద మన మేమి యయ్యెదమో చూచుకొనుఁడు" అని తేఁటపఱచెను. పిమ్మటనదిచెప్పి నట్లే వీఁగిన యాఁబోతు కాలుక్రిఁద నెన్నియో కప్పలుపడి చితికిపోయెను.

గీ॥ గొప్పవారుపోరు ॰ నప్పుడుతక్కువ
వారుచెంతనుండి ॰ బాగుపడరు
పోటులాడుచున్న ॰ పోతులయొద్దను
దిరుగుకప్పలెల్లఁ ॰ దివ్నఁబడెనె.

## 16. గ్రద్ద, గువ్వలు

ఒక గ్రద్ద గువ్వలను దినఁగోరి యెగురుచుండెను. కాని

దానికొక గువ్వయైనను దొరకకుండుటచే నది యాగువ్వలతో నొకనాఁడేకముగా నిలువఁబడి "గువ్వలారా మీకేమో నావలనఁ గీడుకలుగునని యనుకొనుచున్నారు కాని నాతలంపు దయ్యాకమున కెఱుక. మిమ్ములను బట్టి తినెడు డేగ మొదలగు పెద్దపిట్టలు మీజోలికి రానీకుండుటకై నేనును మరికొన్ని నా నేస్తము గ్రద్దలను దలంచితిమి. కాన మీరందఱును నా చెప్పినట్లు తిరిగితిరేని మీ కెన్నఁడును గీడు పుట్టనేరదు" అని యొప్పించెను. పిమ్మట గువ్వలన్నియు నాగ్రద్దకు లోనై యదిచెప్పిన చొప్పున నడుచుకొనుచుండెను. అంతట నొకనాఁడా గ్రద్ద రెండు గువ్వలను జంపితినుచుండుటఁ జూచి గువ్వలన్నియుఁ జేరి గ్రద్దతో "ఏమిది నీ మాట నీవే తప్పెదవా!" అనెను. అందుకా గ్రద్ద "నేను మిమ్ముల నేలుచున్నానుగదా నాకీపాటి సొత్తు తగదా" అని చెప్పెను. అదివిని గువ్వలన్నియు "పంచుయింటి కుందేళ్లసామెతెగా నున్నది. ఇంకనైనఁ దెలివిఁ దెచ్చికొందము" అని యనుకొనుచు గ్రద్ద కందక దబ్బునఁ బాఱిపోయెను.

గీ॥ చెఱుపు సేయువాని • నెఱిఁగినయువ్వాని
తోడఁగూడువారు • కీడుఁగంద్రు
గ్రద్దయొద్దనమ్మి • కంబునఁజెల్లాడు
గువ్వలెల్లఁజేటుఁ • గొనఁగలేదె.

17. ఇద్దరాండ్రవాఁడు

ఏఁబదియేండ్లుగల యొకని కిరువురు పెండ్లములు గలరు.

అందులో నొకతె వాని యీడుగలది. రెండవయామె ప్రాయము పడాతెండ్లు. ఆయిరువు రొకనాఁడు మగనికిఁ దలయంటఁజొచ్చిరి. అప్పుడు పెద్దది మగనికంటెఁ దాను మిగులఁజిన్నగాఁ గనుపట్టుటకై యాతనితలమీఁది నల్లవెండ్రుకలన్నియుఁదీసివైచెను. రెండవది మగని మఱింత పడుచు వానిని జేయఁగోరి తెల్లవెండ్రుకలను దెఱికివైచెను. పిమ్మటవాఁడు "తల బోడిగనైన విల్పుడు. ఇఁక నాజోలికి రాకుండినఁ హాయిగ నుండెదను" అని లేచి పోయెను.

గీ॥ ఇద్దరాండ్రఁగలుగు • నెంతటివాఁడైన
నవ్వఁబడునుచుదకు • అన్వఁబొంది
పపతి యాండ్రుతనకు • పాలాలుగాఁదల
యంటమగఁడుబోడి • యగుచుఁబోఁడె.

## 18. పెంపుడు కుక్క, చిఱుతపులి

ఒక ముసలి చిఱుతపులి వెన్నెల బైటఁ గ్రొవ్వి చెల్లాడుచున్న యొకపెంపుడు కుక్కనుజూచి "నాయనా! అడవియంతయు నాదికదా. కాని బొత్తిగఁ దిండిలేక యెట్లైనఁదితినో నావైపొకసారి చూడు. నీ పని యింత బాగుండుట నాకు వింత యగుచున్నది. నాకుఁగూడ కొంచెము దారి చెప్పరాదా నీమేలెన్నటికైన మఱచెదనా" అని పల్కెను. అందుకాకుక్క యొకేంబడి "అడిగితివి కనుక వినుము. నన్నొకఁడు పెంచినాఁడు అతఁడు నాకెల్లప్పుడు పాలు, రొట్టె, నెయ్యి మేపుచుండును. ఆతని యింటికి నేనెప్పు

దును గావలి యుండెదను. నీవు నా వలె నుండెదవేని నతఁడు నీకుఁగూడ బాగుగఁ జరుపును. నా వెంటరమ్ము" అని చిఱుత పులి నొప్పించి తన్నుఁ బెంచినవాని యింటికిఁ దోడుకొని పోయెను. పిమ్మట నాయింట నొకమూలఁగొయ్యకుఁ గట్టబడినఁ గొలుసునుజూచి చిఱుతపులి కుక్కతో "నేస్తమా! యిదేమిటి" అని యడిగెను. అందుకాకుక్క "అయ్యా! నేనెక్కడికిని బగలు తిరుగకుండ గొలుసుతో నన్నతఁడా కొయ్యకుఁగట్టి చీఁకటిపడిన తోడనే విప్పి తెల్లవాఱు వఱకు నన్దిరుగనిచ్చును" అని చెప్పెను. అదివిని చిఱుతపులి నవ్వుచు "ఇన్నాళ్లు గడపినాను. ఒకనికట్టులో నేనెన్నఁడు నుండలేదు. ఇఁక నరువదేండ్లు కగ్గి గంటన్నట్లు జానెడు పొట్టకై యొకని కట్టునకు లోఁబడి బానిసీకుఁడయ్యేదనా" అని పాఱిపోయెను.

గీ॥ కలిగినంతలోనఁ • గడపుకొనుంగాని
తెలివిగలుగువాఁడు • కొలువఁబోఁడు
పాలురొట్టెయొకని • పంచను గలదని
కుక్కపిలువఁగఁ బులి • కొలువఁజనెనె.

## 19. నక్క, అందని పండ్లగుత్తి

ఒకనక్క చెట్టుక్రింద నిలఁబడి పండ్లగుత్తి నందుకొనఁ బోయెను. అది యెంత యెగిరినను బండ్లగుత్తి యందలేదు. అప్పుడానక్క విసిగి "ఇస్సీపీ యీపండ్లు చేఁదు, నోరు చెఱుపు

కొమట తప్పు నేమి చవికలదు! నాకక్కఱలేదు" అని లేచి
పోయెను.

గీ॥ తనకురానిదానిఁ • దక్కువగాఁ జూచి
చెనఁటివాఁడు డాబు • వేయుచుండు
అందరానిపండ్ల • కాసించి తుదకని
చేఁదటంచు నక్క • చెప్పిపోదె.

## 20. ఆకురాయి, కట్లపాము

ఒక కట్లతుట్టి యెరమ్రింగుటకై వెదకుచుఁ గంసలి
వానియింట నొకయాకురాతిని మ్రింగఁబోయెను. అదిచూచి యా
యాకురాయి యాతుట్టపాముతో "ఆహా యెంత తెలివిమాలినదా
నవు. ఇనుమునైన రాసి తిను నన్నుఁ జప్పరించుచున్నావా!"
అని యనెను; బిమ్మట దవడలవెంబడి నెత్తురు కాఱఁ దుట్టపా
మింకొక చోటికిఁ బోయెను.

గీ॥ లొంగరానివాని • లొంగింపఁజేయఁగఁ
బూనునట్టివాఁడు • తానెచెడును
ఇనుమునైనరాసి , తిను నాకురాతిని
బట్టిమ్రింగుతుట్ట • బాగుపడెనె.

## 21. నక్క; మేఁకపోతు

ఒకనక్క నూతిలో కాలుజాఱిపడి పైకెగరలేకుండెను.
అంతట నొక బారకొమ్ముల మేఁకపోతు దప్పితీర్చుకొనుటకై

నీరు వెదకుచు నానూతిలోఁ దొంగిచూచి నక్కతో "ఏమోయి నక్కబావా నీరుత్రాగుచుంటివా, యేలాగున్నది" అని యడిగెను, అదివిని యానక్క "ఆహా చెఱకుపానకమువలె నున్నది. ఈనీరు త్రాగనివాని బ్రతుకేంటికు" అని చెప్పెను. ఆమాటనమ్మి మేక పోతు గొబ్బున నూతిలో దుమికెను అప్పుడు నక్క చటాలున మేక కొమ్ములపై కెక్కి నూతిలోనుండి చెంగునఁబైకి దాఁటెను.

గీ॥ తనకుమేలుచేతు • నని తీయఁగానాడు
వానిచొప్పుఁగని • వాఁడుచెడును
బావిలోనినక్క • పలుకులువిని మేఁక
పోతునూతఁదుమికి • పొలిసిపోదె.

## 22. చూలు కొండ

ఒక పెద్దకొండ యీనలేక నొప్పులు పడుచుండెను. అది చూచి యందఱును దానిచెంతనిలిచి "ఇంత పెద్దకొండ కెంత బిడ్డ పుట్టునో" యని చూచుచుండిరి. అంతట నందఱును బక పక నవ్వునట్టొక చుంచెలుక తటాలున బైటపడెను,

గీ॥ చెలఁగి గడబిడ మిక్కిలి • చేసెడువది
కొనకుఁగడుఁగొద్ది కానఁబడుఁ • గనుముముందు
ఉబికిగగ్గోలుగానొప్పు • లఁబడికొండ
కడకునొక చిన్నయెలుకను • గాంచలేదె.

## ముసలి వేఁటకుక్క

ఒక వేఁటకుక్క దానిని బెంచినవానికి మాటిమాటికి హెచ్చరికఁ బుట్టించుచు, నతఁడు చెప్పిన పనులను దప్పక నెఱ వేర్చుచుండెను. కాని కొన్నాళ్ళకది ముదుసలిదాయెను. అంతట నొకనాఁడాకుక్క ముసలిదైనను బొలములోఁబడి మేయుచుం డెడి యొకదుప్పిపైఁబడి చట్టబట్టుకొనెను. కాని యాకుక్కకుఁ బంటిదట్టము లేనందున దుప్పిచట్ట విడిపించుకొని పాఱిపోయెను. అదిచూచి యాకుక్కను బెంచినవాఁడు దుప్పిని విడిచిపెట్టినందున కలిగి దానిని గఱ్ఱతో మొత్తెను. అప్పుడాకుక్క వానితో "అయ్యో! నన్నుఁగొట్టకు; ముసలిదానిని గనుక నాకుఁ బంటి బిగిపోయెను" అని యేడ్చెను, పిమ్మట దానిని వాఁడు కొట్టుటమానెను.

గీ॥ కోడెతనమునందు • గొప్పనందినవాఁడు
ముదిమియందు మిగుల • గదుమఁబడును
పసితనంబునందు • బాగెన్నఁబడు కుక్క
ముసలితనమునందు • మొత్తబడదె.

## 24. సింగము, చిట్టెలుక

ఒక సింగము వేటఁబడలికతో నొకకొండ పంచలో, బండుకొనెను. అంతటఁ గొన్ని చిట్టెలుకలు దానిపై నుండి పరు గిడుచుండెను. అప్పుడా సింగము చీఁదఱతో మేల్కొని యొక చిట్టెలుకనుబట్టి చంపఁబోయెను. అందుకా చిట్టెలుక సింగముతో

"అయ్యా నావంటిదానిని జంపిన నీకేమివచ్చును. ఇది నీ పరువు నకుఁ దక్కువకదా! నన్నుఁ గాచెదవేని నాతలకుఁ దగిన మేలు నీకు జేయకుందునా! నాయందుఁ గనికరించి నన్ను విడువుము" అని వేఁడెను. అదివిని జాలిపడి సింగము చిట్టెలుకను జూచి నవ్వుచు "నీవు చూడు నాకు మేలుచేయుట చూడు! పోపో" అని విడిచెను. మఱికొన్నాళ్ళ కాసింగము వేఁటకాని వలలోఁబడి బొబ్బరించుచుండెను. అదవిని చిట్టెలుక యా సింగము వద్దకు వచ్చి "అయ్యా చూచితివా! ఎంతవానికైనఁ నొక్కతీరునఁ గడచునా. మంచిది. జడియక కొంచెము తాళుము" అనిచెప్పి తన చిట్టెలుక దండును రప్పించి యా వలను తెప్పపాటునఁ గొఱికించివైచి సింగమును గాపాడెను. అందుకాసింగము చిట్టెలుకను మిగులఁగొనియాడుచు "ఎలుక నేస్తమా! కోరుకొనుము నీవడిగినది యిచ్చెదను" అని యనెను. అది విని పొంగి యా చిట్టెలుక యొడలు మఱచి "నీకూఁతునన్నాకుఁ బెండ్లిసేసెదవా" అని కోరెను. అందుకొప్పి సింగము తన పడుచును బిలిచి నవ్వుకొనుచు "అమ్మా నీకుఁ దగిన పెండ్లికొడుకిన్నాళ్ళ కబ్బెను. ఈడు జోడును బాగుగానున్నది, అతఁడదుగో యాచెట్టుక్రింద నీకెదురు చూచుచున్నాఁడు. అక్కడికిపోయి నీపెనిమిటితోఁ గాపురము సేయుము" అని పంపెను, అప్పుడాపడుచు తండ్రిమాటచొప్పునఁ జెట్టుకడకు వచ్చి నలువైపులఁ జూచుచుండెను. అంతటఁ జిట్టెలుక పెండ్లికొడుకెదురుకోలు సందడితో, వినునటు చెలగాటమాడుచుఁ బెండ్లకొమారితె కాలుక్రిందఁబడి నుగ్గుగాఁ జితికిపో

యెను. పెండ్లి కూతురెంతటికిని బెండ్లికొడుకు రాకఁగానక తిరిగి తంద్రియొద్దకుఁ బోయెను.

(1) గీ॥ గొప్పవాఁడుమిగుల • గొద్దివానినయినఁ
గాచివానివలనఁ • గావఁబడును
కొదమసింగ మెలుక • కూననుగాపాడి
దానివలన వలను • దప్పిపోదె.

(2) గీ॥ తనకుమించినట్టి • దానినిల్లాలుగాఁ
జేసికొనెడువాఁడు • చెట్టఁబొందుఁ
చెలఁగిపెండ్లికొఱకు • సింగంపుఁ బడుమను
గొనినయెలుక యుసురుఁ • గోలుపోదె.

## 25. గుఱ్ఱము, దుప్పిపోఁతు

ఒక దుప్పిపోతు మెరకపై మేయుచుండెను. అంతట నొక గుఱ్ఱముకూడ మేఁత కక్కడికివచ్చెను. అదిచూచి యోర్వలేక దుప్పిపోతా గుఱ్ఱమును దనకొమ్ములతోఁ బొడిచి పాఱఁదఱిమెను. దానిపైఁ బగఁబట్టి యాగుఱ్ఱము దగ్గరనుండు పల్లెకుఁబోయి యొకకాపువానితో "అయ్యా. నేను విన్నమోయఁ గలను. నాపై గూర్చుండు నాజుట్టు వదలక పట్టుకొనుము" అని వాని నెక్కించుకొని యా దుప్పివద్దకు వచ్చి వానిచే దానిని దఱుమగొట్టించి తిరుగా వానిని బల్లెకు దిగబెట్టి వానితో "అయ్యా నాకు చాలా మేలుచేసినావు. ఇఁక నన్ను విడువుము" అని యనెను. అప్పుడు వాఁడు గుఱ్ఱముతో "ఓహో యిదివఱ

కుమ సీవింతపనికి వచ్చినదానవని యెఱుఁగను. తెలిసిన పిమ్మట విన్ను విడిచెదనా!" అని దానిని దన యింటఁగట్టివేసెను.

గీ॥ తన్నులోంగఁజేయ దారియొక్క పికిఁదా
మప్పుకొన్నవాఁడు • ముప్పఁజెందు
పీఁపుమీదనొక్క , కాఁపుఁదానెక్కించు
కొన్నగుఱ్ఱమికుఁమ • గొనఁగలేదె.

## 26. పల్లెటూరి యెలుక, పట్నపు టెలుక

ఒక పొలము మడిగట్టు కన్నములో నొక యెలుక కాపుర ముండెను. దానియొద్ద కొక పట్నపు టెలికె చుట్టరికమునకై, వచ్చెను. అప్పుడు దానికిఁ బల్లెటూరియెలుక జొన్నలు. పెసలు మినుములు, వరి, కందులు. ఉలవలు, చోళ్ళనుములు మొదలగు వానితో విందుచేసెను. పిమ్మట పట్నపుటెలుక యాపల్లె యెలి కెను, పట్నమునకు దీసికొనిపోయి తనయింట గారెలు, బూరెలు, జంతికలటిపె, లట్లు, కజ్జెములు మొదలగు వానితో విందుచేసెను. ఆవిందొక పెద్ద మేడలో జరిగెను. విందారగించుచున్న పల్లెటెలు కను జూచి పట్నపుటెలికె "అన్నా! కంటివా మాపట్నములోఁ గోటలు, పేఁటలు, మేడలు, మిద్దెలు కొట్టులంగళ్ళు, సంత లిండ్లు, వాకిళ్లు, పండిళ్ళనుఁగులు గుఱ్ఱములు సిపాయిదండు. ఫిరంగులు... తుపాకులు, కత్తులు, మందు, గుండ్లు బట్టలు, నగలు నాణెములు, మొదలగునవి యెట్లుండెనో! ఇచటుండ గొప్పదనముండ రాదా" అనెను. అందుకు పల్లెటెలుక నవ్వి యన్నా! "అన్నియు

బాగున్నవి కాని, యిదేమి యీవింత. ఇచట దొంగ తగినవాడ నియు, డబ్బుగలవాఁడు గొప్పవాఁడనియుఁ చదువుకొన్న మంచి పేదవాఁడు మోసగాఁడనియు వాడఁబడుచుండిరి. తెలివిలేని గొప్పఁదనమేల! ఈపట్నపు బడాయికన్న నాపొలమే మేలు, హాయిగా నుండవచ్చును. నాకు నెలవిమ్ము" అని తనపొలము నకుఁ బోయెను.

గీ॥ పట్నమనుచువింత • పడికాపురము పేయ
నేర్పుగల్గువాఁడు • నెట్టుకొనఁడు
పొలములోని యెఱక • తెలివితోఁదనుబట్న
మరసియరసిరోసి • మఱిపోదె.

## 27. కడుపునకుఁగాళ్ళేయి నోళ్ళకును జగడము

ఒకప్పుడు కాళ్లు, చేతులు, నోరు, మొదలగునవి తమలోఁ దాము "వింటిరా, మనము పాటుపడుట, యీ పాడు కడుపు నకు మేపుట; ఇది పూటపూటకుఁగొఱివ్వి గవంతయును బనిచేయ కుండుట, యేమి బాగున్నది! ఇంతటనుండి దీనికొఱకు మనము పాటుపడవలదు; దీనిజోలి తలపోయవద్దు; చూతమెట్లుండునో" అనియనుకొని కొన్నాళ్ల వఱకు దేనిమట్టునకది యూరకుండెను. కాని పిమ్మటఁ దామే బొత్తిగా నెండిపోవుటఁ జూచి యవి తమకుఁ గడుపువలనఁ గలుగు మేలును దలంచుకొని, తెలివి తెచ్చుకొని యెప్పటియట్ల పాటుపడసాగెను.

గీ॥ ఇమ్మఁ దెలిపికొంటక • యేలిపవానితో
వెమ్మి దొఱఁగువారు • నెగ్గలేరు
కడుపుతోడఁబొత్తు • గడపనికాల్పేతు
లెల్లవాపిఁదొలఁగి • యెండిపోవె.

## 28. వాన కోయిల, దానిపిల్లలు

ఒక వానకోయిల పిట్ట వరి పొలములో గుడ్లుపెట్టి పొదిగి పిల్లలఁజేసెను, అంతట వరిచేనుపండి యొరగెను, అంతలో దానిపిల్లలుకూడఁ గొంచెము కొంచెమెదుగుచుండెను. అప్పుడు తల్లిపిట్ట పిల్లలతో, "పిల్లలారా! జూచితిరా! ఈ చేను పండెను. పొలముగలవాఁడు కోఁతకు రాకముందే మనము పైకిఁబోవల యును. కనుక నేను మేఁతఁదెచ్చుటకై పోయినప్పుడా కాఁపువా డిక్కడికి వచ్చి యేమనుకొనునో, నేను తిరిగివచ్చిన తరువాత నాతోఁ జెప్పవలెనుజుఁడీ' అని చెప్పి మేతకై పోయెను. పిమ్మటఁ గొంతసేపునకా కాఁపువాఁడు పొలమునకు వచ్చి తన కొడుకును బిలిచి "నాయనా చూడు పొలముపండి యొరగెను. ఇంకఁ గోయనియెడల బొత్తిగా గింజలు రాలిపోవునుగదా! కనుక మనయిరుగుపొరుగు వాండ్రను రేపు పెందలకడనే కోతకు రమ్మని పిలుచుకొనిరమ్మ" అని చెప్పిపోయెను. తరువాతఁ గొంతతడవునకా తల్లిపిట్ట వచ్చి పిల్లలతో "వింటిరా యేమి జరిగెను? అని యడిగెను. అప్పుడవి యన్నియుఁ దల్లితో "అమ్మా వాఁడిప్పుడే యిక్కడికి వచ్చి పోయినాఁడు. తన

కొడుకుతోఁ జేమకోఁతకుఁ దెల్ల వారినతోడనే యిరుగు పొరుగు వాండ్రను బిలుచుకొని రమ్మన్నాఁడు" అని జడియుచుఁ జెప్పెను. అదివిని తల్లిపిట్ట పిల్లలతో "సరిసరి యిదేకదా, యిరుగు పొరుగువారేమి, యిచటికి కోఁతకువచ్చుటయేమి! నామాట రేపు వాండ్రురారు. వట్టిది మీరు జడియవద్దు కాని రేపుకూడ నేటి వలె మీరు వాఁడేమి తనకొడుకుతోఁ జెప్పునో విని నాతోఁదప్పక చెప్పవలెను జుండీ" అని చెప్పి తెల్లవాఱిన వెనుక మేఁతకై పోయెను. ఆ పిమ్మట నాకాఁకాపువాఁ డక్కడకు వచ్చి కొడు కుతోఁ "బిలిచితివా నాయనా! ఏమన్నారు" అని యడిగెను. అందుకు వాని కొడుకు "అయ్యా పిలిచినాను. ఇప్పుడే వచ్చెద వచ్చెదమన్నారు కాని యింకను రాలేదు, చాలా యెండయెక్కి నది. ఇఁక రారు కాఁబోలు" అని చెప్పెను. అది విని తండ్రి కొడుకుతో "అన్నా చూచినావా యెట్లు మోసపుచ్చినారో! పోనీ రేపు నీమేనమామలను, బినతండ్రులను, బిలువుము" అనిచెప్పి యింటికి మఱలెను. తరువాత నా తల్లిపిట్టతోఁ బిల్లలు జరిగిన దంతయుఁ జెప్పెను. అదివిని తల్లిపిట్ట "బాగుబాగు వీవి చుట్టము లమ వమ్మకొన్నాఁడు. తిన్నఁబడినట్లే. పిల్లలారా! తెల్లవాఱనేమి జరుగునో. యదికూడ విని నాతోఁజెప్పుఁడు" అని వేకువనే పయి కిఁ బోయెను. పిమ్మటఁగాఁపువాఁడు కొడుకుతో "నాయనా చూచి తివా వీరో నేఁడువచ్చెదమన్న మనచుట్టము లిప్పటికివిరాలేదు. పోనీ, రేపటికి మన కొడవళ్ళు బాగుచేయించి, మనమే రేపు కోఁత మొదలు పెట్టుకొందము ఇదివఱకై నదియే చాలుఁజాలు"

అని యనుకొనుచు వారిద్దఱింటికిఁ బోయిరి. అంతట నీ మాటలు తల్లివచ్చిన వెంటనే పిల్లలు పూసగ్రుచ్చినట్లు చెప్పెను. అది విని తల్లిపిట్ట "పిల్లలారా రేపు వాఁడే కోఁతకుఁ బూనుకొన్నాఁడా! అట్లయినఁ దప్పక వచ్చును గనుకఁ దెల్లవాఱకముందు మఱి యొక చోటికి మనము పోదము" అని యా వానకోయిలపిట్ట తన పిల్లలతో వేగుఁబ్రొద్దునలేచి యింకొక చోటికిఁ గాపురము నకుఁ బోయెను.

గీ॥ తనకుఁజేతనైన • తనపనియొరులపై
మోపువాఁడు తుదకు • మోసపోవు
చేనికోఁతపనిని • జేయఁజుట్టములపైఁ
బెట్టఁగాఁపువాఁడు • వెట్టుకొనెను॥

## 29. దాది నక్క

ఒక దాది యెంత జోకొట్టినను బిల్లయేడ్పు మానకుండుట జూచి జడిపించుటకై వట్టిదే "ఓ నక్కబూచీ రావే; మా పిల్ల యేడ్పు మానకున్నది" అని పెద్ద గొంతుతోఁ బిలిచెను, ఆ పొరుగువనే కోళ్లను బట్టుటకై వచ్చియున్న యొక పెద్దనక్క యా మాటవిని తనకా దాదిపిల్ల నిచ్చివేయుననుకొని దాది యున్నగది కిటికియొద్ద విలఁబడెను. పిల్లను మఱింత జడిపించుట కా దాది యెంచి "అదిగో నక్కబూచి, నీవు కన్నులుమూసికొని, యేడుపు మాని పండుకొనవేని దానికి విన్నప్పగించెదఁజూమా" అని యనెను

ఆమాట నక్క నమ్మికొని ప్రొద్దు దూరువరకా కిటికియొద్దనే కాచుకొని యుండెను. అంతటఁ దెల్లవాఱిన వెంటనే యొక కాఁపువాఁడా నక్కనుజూచి యూరుపొలిమేర దాటువరకు దానిని దుద్దుతోఁ దగిలితగిలి మొత్తెను. ఆ దెబ్బలుతిని సగము చచ్చి యానక్క "అయ్యో దాది మాటలు నమ్మికొని, చేతికి దొరికిన కోళ్లను వదులుకొని వస్తుపడి పడదెబ్బలు తింటినిగదా" అని యాలలిడుచుఁ బోయెను.

గీ॥ ఒరునిమాట తీరు • నరయకనమ్మిన
వాఁడుమోసపోయి • కీడుఁబొందు
తలుపునొద్దనుండి • దాదిమాటలునమ్మి
కొన్ననక్కఁజూచి • తిన్నఁబడెను॥

## 80. డేగ, తాఁబేలు

ఒక తాఁబేలు పైకెగురఁగోరెను. కాని దానికి ఱెక్కలు లేకుండుటచే వీలైనది కాదు. ఆదారిని బోవుచున్న యొక డేగను జూచి యాతాఁబేలు "అయ్యా నీవీఁపుపై నన్నెక్కించుకొని నేను గోరినచోట్లు నాకుఁ జూపెదవేని నీకు వెలలేని ముత్తెములపేరుఁ గానుకగా నిచ్చెదను. నా కోర్కెఁ జెల్లించెదవా!" అని యడిగెను. అందుకా డేగ యొప్పి వీఁపుపై దానిని బెట్టుకొని యది కోరిన చోట్లు దానికిఁ జూపించి క్రిందికిదించి దానితో "ఏదీ నాకిచ్చెద నన్న కానుక!" అని యడిగెను. అది వివి యేమియుఁదోఁచక

తాఁబేలు దాఁగుకొనఁబోయెను. అప్పుడా తాబేలును డేగ గోళ్లతో జీల్చి చంపి పగఁదీర్చుకొనెను.

గీ॥ చేతకానివానిఁ • జేపెదవని పల్కి
వెలవలేనివాఁడు • చెరుపుఁగొనును
డేగనీఁపుమీఁద • వేగినతాఁబేలు
మాట జరుపలేక • చేటుఁగొనదె॥

## ౩౧. గాలి. పొద్దు

ఒకప్పుడు పొద్దును జలిగాలియు నొకరితో నొకరు హెచ్చుతగ్గులకై పందెమాడుకొనుచుండిరి. వారిలోఁ జలిగాలి యొక బాటసారినిఁ జూచి పొద్దుతో "ఈ బాటసారి కప్పుకొనిన బట్ట పారవేసుకొనునట్లు నేను చేయుదునా! ఏమి పందెము!" అని యా బాటసారి వణఁకునట్లు చెలరేఁగి యువ్వెత్తుగా వీచెను. అప్పుడా బాటసారి బట్టను మఱింత గుత్తముగాఁ గప్పుకొనెను. పిమ్మట ప్రొద్దు చలిగాలిని జూచి "నేనుఁగూఁడ జూచెదను. ఈబాటసారి మఱెంత కప్పుకొనునో!" యని యుడుకెత్తునట్లెండఁగాచెను. అప్పుడాబాటసారి పైబట్ట దబ్బునఁ బారవేసి యొక చెట్టునీడను గూర్చుండెను.

గీ॥ గొప్పవారు తగవు • గొనునప్డు తక్కువ
వారిపైనికత్తి • నూఱుచుండ్రు
మొనసితొద్దుగాలి, యును బ్రొద్దునుంబంత
మాడిబాటసారి • కడలవిరరె॥

## 32. సింగపుఁదోలును గప్పుకొనిన కుంటిగాడిదె.

ఒక కుంటిగాడిదె యొక సింగపుఁ దోలును జూచి తనపై దాదుగుకొని పండిన చేలను మేయుచు విచ్చలవిడిఁ బొలముల వెంబడిఁ దిరుగఁజొచ్చెను. దానినిజూచి సింగమనుకొని యందఱును గడగడవడఁకుచుఁ బరుగిడఁ దొడఁగిరి. అంతటఁగొన్నాళ్లకొక చాకలవాఁడు గాడిదెలమందను రేవునకుఁ దోలుకొని పోవుచుండెను. ఆ చెంతనే మేయుచున్న యా గాడిదె తన తోటి గాడిదెకూఁతలు విని తానుగూడ యొడలు మఱచి కూయసాగెను. అదివిని యా చాకలవాఁడు పొడవుగానున్న చెవులనుబట్టి దానిని గాడిదెగానెంచి దానియొద్దకుఁ బోయి "ఓ పాడుగాడిదే! సింగపు దోలును గప్పుకొని యందఱిం బెదిరించుచున్నావా!" అని నవ్వుచు దానిని దుడ్డుతో మొత్తి తోలాడ్చి మందలోఁ గలిపెను.

గీ॥ లేనిగొప్పఁజూపఁ • బూనినల్గురిలోన
వాలకంబువేయు • వాఁడు చెడును
కుంటిగాడిదె బలె • గొప్పకై సింగపుఁ
దోలుఁదొడ్గి యిడుము • పాలుగాదె॥

## 33. పెంకె కుక్క

ఒకఁడొక కుక్కను బెంచెను. అది మిగుల చెడ్డది. కనుక దాని పెంకెతన మడుచుటకై మెడలో నొక దుక్కను గట్టెను. అది గొప్పయనుకొని యాకుక్క తక్కినకుక్కలతోఁ దిరుగుట

తన పరువునకుఁ దక్కువయని యెంచి యొంటిగాఁ దిరుగఁ జొచ్చెను. అప్పుడొక ముసలికుక్క దానిని జూచి "ఓరీ నిన్నుఁ బెంచినవాఁడు నీ పెంకెతన మడంచుటకై నీకీ దుక్క గట్టినాఁడు కాని నీ గొప్పకుఁ గాదు సుమా" అని తెల్పెను.

గీ॥ తనకుఁగలుగు తెలివి • తక్కువ గొప్పగా
నెంచు చేఁనటి యాన • డించఁబడును
మెడమదపకుఁగట్టఁ • బడినట్టి దుక్కము
బొగడుకొనెడుకుక్క • తెగడఁబడదె॥

౩౪. ఇద్దఱు బాటసార్లు. వెలుగుబంటు

ఇద్దఱొక యడవిలో నడచుచుండిరి. వారొకరి నొకరు విడువకుండునట్లు కట్టుఁగట్టుకొనిరి. అంతట వారికొక వెలుగుబంటడ్డముగా వచ్చెను. అప్పుడందులో నొకఁడు పరుగెత్తియొక చెట్టెక్కిపోయెను. రెండవవాఁడు కాళ్లుచాఁచి యూపిరి బిగించి చచ్చినట్లు క్రిందఁ బడుకొనెను. అంతట వానియొద్దకా వెలుగుబంటువచ్చి వాని మొగము మీఁదఁ దనమూతిఁబెట్టి చచ్చినాఁడను కొని విడిచిపోయెను. పిమ్మటఁ జెట్టు మీఁదివాఁడు క్రింది వానియొద్దకువచ్చి "ఓరీ నాతోఁజెప్పవా! ఆ వెలుగుబంటు నీచెవిలో నేమి గుసగుసలాడెను!" అని యడిగెను. అదివిని రెండవవాఁడు "మఱేమియుఁగాదుగాని నీవంటి పిఱికివాని నెన్నటికినీ నమ్మ వద్దని చెప్పెను." అని పలికి లేచి పోయెను.

గీ॥ తెలివిమాలిపిటికి • దేబెతో నేస్తంబు
చేసికొనెడువాఁడు • మోసపోవు
దిట్టతనములేని • యట్టివానిస్నాడు
వాఁడు వెఱగుబంటు • పాలఁబడఁడె॥

## 35. బిందె, కడవ

ఒకయేటియొడ్డున మంటికడవయు, నిత్తడిబిందెయు నుండెను. అంతట నేఱుపొంగ నీరెండును నడుమఁబడి కొట్టుకొని పోవుచుండెను. అప్పుడా కడవ బిందెతో "అయ్యో నా పనియేమి కాఁదలఁచినదో గదా" అని వడఁకుచుండెను. అది విని బిందె కడవతో "నేను దగ్గఱనుండగా నీకెందుకీ-తల్లడము! నాకు మఱింత చేరువగా రమ్ము అని పిలిచెను. అప్పుడాకడవ బిందెతో "నావడఁకంతయు నీదాపునుబట్టియే. నిన్ను బతిమాలు కొనెదను, నాయొద్దకురాకు నన్నొంటిగా సాగనిమ్ము" అని తొలఁగిపోయెను.

గీ॥ ఈడుకానివాని • తోడ నేస్తమునకు
నేరుపుగలవాఁడు • చేరఁబోఁడు
బిందెవదికిఁ దమ్ము బిఱ్ఱవట్టేటిలో
మట్టికడవ బోవ నెట్టుకొనెనె॥

## 36. నెమలి, పెద్దేటి కొంగ

ఒకప్పుడొక నెమలి యొక పెద్దేటికొంగనుజూచి తన గొప్పను గనుపఱచి దానిని వెక్కిరించుటకై పురివిప్పి యాడఁ

దొడఁగెను. అదిచూచి కొంగ నెమలితో "ఓహో నా ముందా నీ బడాయి! పిల్లలుకూడ నవ్వునట్లు నీవీపు తెన్నీ వెఱఁగ తెకతెక లాడుచున్నావు. చాలుఁ జాలు నీ బండారము బయలైనది ఇఁక నూరకుండుము, విచ్చలవిడి చెలరేఁగి యెగిరి తిరుగు నన్ను నీకుఁ దోడెగతాళికూడఁ జేసెదవా!" అని నవ్వుచుఁ బాఱిపోయెను.

గీ॥ ఒకనికొక్క నేరు • పుట్టి యెఱుంగని
దేలెగోటుఁ జూపి • తెగడఁబడును
కొంగయొద్ద నెమలి • గొప్పకై పురివిప్పి
యాడియెక్క పక్కె • మాడఁబడదె॥

## 37. చింతచెట్టు. తెల్లదుబ్బు

ఒక యేటి యొడ్డునఁ జింతచెట్టొకటి గాలికి విరిగి యేటఁ బడి కొట్టుకొని పోవుచు నా యొడ్డుననే చెక్కుచెదరక నిలిచి యున్న తెల్లదుబ్బును జూచి "ఏమీ వింత. నాయంత వానినే కూకటివేళ్లతో మూఁకలాగిన పెనుగాలి కొకింతయైనఁ బెదర కున్నావు" అని యడిగెను. అందుకాదుబ్బు చింతచెట్టుతో "అయ్యా గొప్పవాని నెదిరించక లొంగి తిరుగువాఁ డెన్నటికిని జెడఁడు సుమా" అని తలయూచి పలికెను.

గీ॥ లొంగితిరుగుచోట • లొంగకయెదిరెడు
వాఁడుతప్పకెప్పుడు • కీడుఁబొందు
పెద్దగాలికెదిరి • విఱ్ఱవీఁగినచింత
వేళ్లతోడఁగూడ • పెఱుకఁబడదె॥

## 38. పులి, వఱడు

ఒక విలుకాఁడడవిలో వేఁటాడఁదొడఁగెను. అప్పుడులేళ్లు దుప్పులు, కణుజులు, కాఱుదున్నలు గొఱ్ఱెపోతులు, పందులు మొదలగునవి యఱచుచు నలువైపులఁ బరుగెత్త సాగెను. అది చూచి యొక పెద్దపులి వానితో "నేనుండఁగా మీరు జడియనేల, తెప్పపాటులో, నా వేఁటకానిఁ బట్టితినెదను" అని చెప్పి నోరు తెఱచి చెంగు చెంగున దాఁటుచుండెను. అంతట నొక పెద్దకోల వచ్చి దాని రొమ్ము దూసికొని పోయెను. ఆనొప్పి తాఁళలి కదల లేక కాఱుబొబ్బలు పెట్టుచుండెను. అదివిని దానియొద్దకొక వఱడువచ్చి "అయ్యో! నీయంతవాని నిట్లు చేసినవాఁ డెవఁడు చెప్పుమా, యెంతపని జరిగెను" అని వగచెను. అందుకాపులి కన్నీరువంచుచు "అహా యెంత తెలివి మాలినవాఁడను, ఒడలు క్రొవ్వు గవ్వకైన నక్కఱకాదుగా. ఆ విలుకాని నేర్పుగదా నన్నింత చేసెను" అని యేడ్చెను.

గీ॥ కండక్రొవ్వుతోడఁ • గానక నేర్చిన
వాని నెదురుకొనెడు • వాఁడు చెడును
వేఁటకానినెదిరి • విఱ్ఱవీఁగినపులి
కోలదాఁకనేలఁ • గూలిపోదె॥

## 39. సింగము, నాలుగాఁబోతులు

ఒక యడవిలో నాలుగాఁబోతులు జట్టుకట్టుకొని యొక్క చోటనే కలసి మెలసి తిరుగుచుండెను, అదిచూచి యొక సింగము

"ఆహా! ఈ నాలుగాఁబోతులు తోడునీడలవలె నొకదాని నొకటి
విడువక తిరుగుచున్నవి. ఈ నాల్గింటితో నొకమాఱు పోట్లాడఁ
జాలనుగదా. కనుక వీనిలో వీనికిఁ బొరలుపుట్టించినచో దేనిమట్టు
నకది యొంటిగా దొరకును" అని తలఁచి యా నాలుగాఁబోతు
లతో మొట్టమొదటఁదామఁ బొత్తుగానుండి తుదకానాల్గిఁటిలో నొక
దానితో నొకదానికిఁ బడకుండఁ జేసెను. పిమ్మట నానాల్గును దేని
మట్టుకది యొంటరిగా మేయుచుఁ దిరుగఁజొచ్చెను. ఆ వెనుక
సింగ మొక్కొక్క దానినే తేలికగాఁ జంపి తినివేసెను.

గీ॥ జట్టుదారులొరుల • వాడిలు విడివడఁ
బడినవారికెల్ల • విడుమవచ్చు
కొండెములనువమ్మి • కొనెవ యాఁబోతులు
పొత్తుమాని తిరిగి • పొలసిపోవె॥

## 40. కాకి, చెంబు

ఒక కాకి మిగుల దప్పితో నీటికై నలువైపులు కనిపెట్టు
చు నొకచోటఁ జెంబులో నీరుండఁజూచి త్రాగుటకు తొందఱతోఁ
జెంబువద్దకు వచ్చి దానియంచుపై నిలఁబడెను. అది మెడయెంత
వంచినను దాని ముక్కునకు నీరందీ యందనట్లుండెను గాని పీల్చు
టకు వీలుకాలేదు. పిమ్మట గాకి చెంబు నొత్తిగిల జేయఁబోయి,
యట్లు చేయఁజాలక, యాదగ్గరనే యున్న కొన్ని చిఱురాళ్ల
నొక్కొక్కటిగాఁ దెచ్చి యాచెంబులోఁ బడవేయఁ జొచ్చెను, అం

తటఁ గొంత సేపటికి చెంబులోని నీరంచుల యొద్దకు వచ్చెను.
అప్పుడు దప్పితీర్చుకొని యాకాకి యెగిరి పోయెను.

గీ॥ నేర్పుగలుగువాఁడు • నెఱవేఱునందాకఁ
బనికిఁ జొచ్చికోర్కి • బడయుచుండు
మూతికందనట్టి • ముంతనీటను రాలు
గూర్చి కాకిదప్పి • తీర్చుకొనదె॥

## 41. బండివాఁడు వేల్పు

ఒకఁ డొంటిగా నడవిలోనుండి యూరున కొక బరువు బండిని దోలుకొని పోవుచుండెను. ఆబండి కొంత మేర సాగ నొకచోట నూబినేలలో విరుసుల మోయ కూరుకొని పోయెను. అప్పు డాబండివాఁడు "అయ్యో! దయ్యమా! ఆహా దేవరా! నీవైన జూడవా! ఈ నట్టడవిలో నీవు దప్ప నాకెవరున్నారు" అని యేడ్చి యేడ్చి తోదేమియుఁ గానక బండిదిగి యొకచేత నుండఁబట్టుచుఁ దక్కినచేతఁ గఱ్ఱతోఁ బోతులను గొట్టెను. అప్పుడాబండి బాడి నుండి తప్పింపఁబడెను. పిమ్మట వాఁడు బండిని దోలుకొని పోయెను.

గీ॥ తనదులాగుకొలఁదిఁ • బనిసేయకుండిన
వానిమొఱ్ఱనెవ్వ • రైనవినరు
ఊబిలోనిబండి • మార్చకవేల్పును
వేఁడుబండివాఁడు • తోడుగ నెనె॥

## 42. బంగారు గ్రుడ్లు పెట్టుబాతు

ఒకఁడొక బాతుపిట్టను బెంచెను. అది ప్రూటకొకబంగారు గ్రుడ్డు చొప్పునఁ బెట్టుచుండెను. అంతతోఁ దనివితీరక వాఁడా బాతుకడుపులోని బంగరు గ్రుడ్ల నన్నిఁటి నొక్కమాఱే తీసికొనఁ దలఁచి దానిని జంపి కడుపు చీల్చెను; కాని వానికందులో నొక గ్రుడ్డుఅయిన దొరకలేదు.

గీ॥ తనకుఁగలుగుదాని • దబ్బున హెచ్చింపఁ
బూనునట్టివాఁడు • మోసపోవు
ఒక్కమొగినిబసిఁడి • నొందఁగబాతును
జీల్చువెడఁగు మొదలు • చెఱుచుకొనఁడె॥

## 43. నక్క. పిల్లి

ఒక నక్క పిల్లినిజూచి "ఓయీ! నీపయి కెవరైనవచ్చి నపు డెట్లు కాచుకొనఁగలవు." అని యడిగెను. అందుకాపిల్లి "నాకొక్కదారితప్ప మఱేమియుఁ దెలియదు" అని చెప్పెను. అదివిని నక్క "అయ్యో యింతే - నాకు వేయి చిక్కులు తెలియునుగదా, నీవందులోఁ గొన్నియైన నేర్చుకొనరాదా!" అని యాసడించెను. ఇట్లా రెండును మాట్లాడుచున్నపుడే కొన్ని వేఁట కుక్కలారెంటిపైకి వచ్చుచుండెను. అంతటఁబిల్లి దబ్బున చెట్టెక్కిపోయెను. నక్క కుక్కలకుఁజిక్కి చంపఁబడెను.

గీ॥ ఎల్లవారికన్న • నెక్కుడుచిక్కులు
తెలియుననెడువాడు • పొలసిపోవు
పిల్లియొద్దరేగి • పెంకెమాటలు ప్రేలు
నక్క కుక్కలకును • జిక్కిపోదె॥

## 44. ముసలివాఁడు, చావు

ఒక ముసలివాఁడు కడుపునకు జరుగక కట్టెలమ్ముకొని బ్రతుకుటకై యడవికిఁబోయి కొన్ని కట్టెలను విఱిచి మోపుకట్టి నెత్తిపై కెత్తికొనఁజాలక, "ఓ చావా! నీవైన రావా నేనెన్నాళ్లీ యిబ్బంది పడఁగలను" అని యేడ్చుచుండెను. అంతట వాఁడు కోరినట్లు చావువచ్చి వానియెదుట నిలఁబడి "ఓరీ నన్నెందుకు పిలిచినావు" అని యడిగెను. అప్పుడా ముసలివాఁడా చావునుజూచి బెగ్గడిలి గడగడ వడఁకుచు "అయ్యా మఱెందుకుఁగాదు. ఈ మోపెత్తుకొనఁజాలను, దీనినానెత్తికెత్తెదవా!" అని వేఁడుకొనెను.

గీ॥ తనదుబ్రతుకునఁదీపలే • దనెడువాఁడు
చావుచేరంగవచ్చినఁ • జావలేఁడు
చావఁగోరిన ముదుసలి • చావుతన్ను
గదియవచ్చిన బెగ్గిలి • కావుమనఁడె॥

## 45. వలపు గల సింగము

ఒక సింగ మొకకొండవాని కూఁతుమ జూచి వలచి యా కొండవానితోఁదన కోర్కెఁ దెలిపెను. అప్పుడా కొండవాఁడు

మిగుల జడిసి యేమియును దోఁచక కొంతసేపటికి తెలివితెచ్చు కొని యా సింగముతో "అయ్యా నీవు నాకల్లుఁడవగుటకన్న నాకు గొప్పమతేమికద్దు, కాని యిందునకొక యిబ్బంది యున్నది. అది నీవు గడిపెదవేని యిఁక నాకుఁ గావలసినదేమి"! అనెను. అదివిని సింగము "ఏమా యిబ్బంది"! అని యడిగెను. అందుకా కొండవాఁడు "అయ్యా మఱేమియు లేదు కాని, నాపిల్ల పువ్వు వంటిది. నీగోళ్లఁ గోఱలఁజూచి వడఁకుచున్నది, అవి తీసివేయించు కొనెదవేని నీకోర్కెకు నా యడ్డేమియును లేదు" అని వేఁడెను. అందుకా సింగమొప్పి తనగోళ్లఁ గోఱలను వానిచేఁ దీసివేయించు కొనెను. పిమ్మటఁ గొండవాఁడు నవ్వుచు సింగమును దుడ్డుతో మొత్తి పాఱఁదఱిమెను.

గీ॥ తెలివితప్పవచ్చు • వలపుతోమందెకు
వాఁడుమోసపోయి • కీడుఁబొందు
కొండవానిమాఁటఁ • గోరుసింగముతన
గోళ్లకోఱలూడ్చి • కొట్టఁబడదె॥

### 46. ఆఁడుపంది, ఆఁడుసింగము

ఒక యాఁడుపంది యొక యాఁడు సింగమువద్దకుఁబోయి "అమ్మా వింటివా-యేటికి రెండుసార్లు కనెదను. కాన్పు కాన్పునకుఁ బది కూనలకుఁ దక్కువ పెట్టను. నీకుఁబేరు గొప్పగాని, యేటి కొకసారియైనను గనలేవు - ఒకప్పుడు కంటివేని నొక కూనకు మించి పెట్టలేవు" అని యాసడింపుగాఁ బలికెను.

అపుడాసింగము నవ్వుచు "ఓ పాడుపందీ నీ వెన్నికూనలు పెట్టి నప్పటికేనుఁగులను జంపి తినుకూనను గనుట నీతరమా! ఛీఛీ నీబ్రతుకు నీవు చూచుకొమ్ము" అని గద్దించెను.

గీ॥ హెచ్చుఁదగ్గుఁదులవ • యెక్కుడుమొత్తము
వలనఁజూచుఁగాని • విలువఁగనఁడు
ఒక్కకూనసింగ • మొదవించుననియాన
డించుపందివాసి • వెంచుకొనెనె॥

## 47. రెండు కప్పలు

ఒక వేసవియందు రెండు కప్పలు జట్టుకట్టుకొని, చెఱువులు, మడుగులు, దిగుడుబావులు, కోనేళ్లు, బట్టెలు, బందలు వెదకివెదకి యెందును నీరుగానక తిరిగితిరిగి, తుద కొకనూతి కడకు వచ్చి దాని గట్టుమీఁద నుండి, లోపల నీరుండుటఁజూచి యొకదానితో నొకటి "ఓరీ దీనిలో మనముండినట్లయిన బాగుండుమగాని, యిదియుఁగూడ నెండినచో మనము పైకిరాలేక చచ్చిపోవలసివచ్చును" అని యనుకొని యింకొక చోటికిఁబోయెను.

గీ॥ వెనుకముందుచూచు • కొనితొందఱపడక
తెలివిగలుగువారు • తిరుగుచుందు్రి
ఉందవిల్లులేక • యుండియుఁగప్పల
జట్టునూతముఱక • నెట్టుకొనెనె॥

## 48. పిసినిగొట్టు

ఒకని కొకచోటఁ గొంత సొమ్ముదొరికెను; కాని వాఁడు దానిలో నొక దమ్మిడియైనను ముట్టుకొనక యడుగుకొని బ్రతుకుచుఁ దనసొమ్ము నొకచోటఁ బాతిపెట్టి పూటపూటకా చోటును జూచి ముచ్చటపడుచుండును. అంతటఁ గొన్నాళ్లకాకిటుకు నిం కొకఁడు తెలిసికొని యాసొమ్మును ద్రవ్వి యెత్తుకొనిపోయెను. ఆ మఱునాఁడా పిసినారి గొట్టెప్పటివలె వచ్చి చూచుకొని యక్కడ సొమ్ములేనందున "అయ్యో నాసొమ్మో, నాసొమ్మో" అని యేడ్వసాగెను. అదివిని వాని పొరుగువాఁడువచ్చి "ఓయీ యెందుకాలాగు మొఱ్ఱ పెట్టెదవు. నీ సొమ్మక్కడనే యున్నదను కొనఁ గూడదా. మునుపటివలె నా చోటును జూచుకొనుచు ముచ్చటపడరాదా! దానిలో నొకగవ్వయయిన నీవు తీయఁదలఁచు కొనలేదు గదా. తినలేని యేడుపెందుకు" అని వాని పిసినితన మునుగూర్చి చీవాట్లు పెట్టెను.

గీ॥ ఒరులకొసఁగఁబోక • యున్నసొమ్మమదినఁ
బోవివాఁడుతుదకు • మోసపోవుఁ
తుడువలేకదబ్బు • గోల్పోయిపిసినారి
గొట్టువెత్తినోరఁ • గొట్టుకొనఁడె॥

## 49. టేఁకుచెట్టు, చిట్టివాఁక తుప్ప

ఒక టేఁకుచెట్టు విచ్చలవిడిఁ దనగొప్పఁదాఁజెప్పుకొను చుండెను. అప్పుడు దానిని జూచి యొక చిట్టివాఁకతుప్ప 'ఓహో

గొప్పజెప్పుకొని విఱ్ఱవీఁగుచున్నావా! నీ యొద్దు పోదవుఁజూచు కొని బడాయి కొట్టుచున్నావుకాని యెప్పటి కేమివచ్చునో తెలిసి కొనవుగదా రేపో మాపో నీ పాట్లు గొడ్డలికెఱుక' అని తగినట్లు మాటి చెప్పెను.

గీ॥ తనకుఁదానెపొగడు • కొనునట్టివానికిఁ
దెలివిగలుగువాఁడు • తెలియఁజేయు
గుట్టుమాలిపొగడు • కొనుచేఁకునకునూటిఁ
జిట్టివాఁకతుప్ప • చెప్పలేదె॥

## 50. ఎద్దు, మేఁక

ఒక సింగ మెద్దును వెనుదగులుచుండెను. అప్పుడాయెద్దు తప్పించుకొనుటకుఁ జెంతనున్న యొక కొండయొండలోనికిఁ బోయెను. అచ్చటనున్న యొక బొరకొమ్ముల మేఁకపోఁతా యెద్దును లోనికి రాకుండ గదిమి యెగిరి పొడువఁబోయెను. దానిని జూచి యెద్దు మేఁకా నీపోటు తనమును నీకేచూపించెదను; కాని యిప్పుడు వీలుకాదు'' అని యింకొకచోటికిఁ బాఱిపోయెను.

గీ॥ వంతతోడుత నొకగొప్ప • వాఁడుతవదు
చెంతఁజేరినఁ జెనఁటిబ • ్రంతుపేయు
కొదమసింగంబునకు నెద్దు • బెదరిమేఁక
పట్టుఁగోరిపడిమిట్టి • బిట్టిపడదె.

## 51. పిల్లి, ఎలుకలు

ఒక యింటిలోని యెలుకలు తమ్ముఁ బట్టితినుచువచ్చిన పిల్లికిఁ దొరకఁబోక మిద్దెపైకిఁబోయి క్రిందికి దిగకుండెను. అది తెలిసి యాపిల్లి కాళ్ళు పాఱఁజాచిపెట్టుకొని చచ్చినట్లు వాలకము వేసెను. ఆ టక్కుఁగనుఁగొని యెలుకలు మఱి క్రిందికి దిగ లేదు. అప్పు డాపిల్లి యిఁకఁదన వాలకము చెల్లదనుకొని మఱి యొకచోటికిఁ బోయెను.

గీ॥ ఇమ్మెఱింగివగఱ • నమ్మకుండెడువాని
ప్రక్కమోసగాని • టక్కువడదు
తెలివిగలిగినమిద్దె • దిగనియెల్కలకఁ
బిల్లివాలకంబు • చెల్లనదియె.

## 52. గుడ్డిగంటి దుప్పి

ఒక యడవిలో నొక దుప్పికలదు. దాని కొక కన్ను గుడ్డి. కనుక నది తన గుడ్డికంటివైపెవరైన వచ్చి తన్నుఁ గొట్టివేయుదురని యెంచి మున్నీటి ప్రక్కకా గుడ్డికన్నుఁ బెట్టుకొని మంచికన్ను దవి వైపునకుఁ ద్రిప్పి మేయసాగెను! కాని, కవికరమా దుప్పిని గడలిప్రక్కనుండియే వేఁటకాండ్రు తెప్ప యెక్కి వచ్చి గుండుతోఁ గొట్టి చంపిరి.

గీ॥ నేర్పుతోడఁదిరుగ • నేర్చినవాఁడైనఁ
దనదుచావుఁదప్పు • కొనఁగలేఁడు

కడలిపై పు గ్రుడ్డి • కవ్విడుకొని మేయు
గదుసుదుప్పితన్నఁ • గాచుకొనెను॥

## 53. కుందేలు, పిచ్చుక

ఒక పెద్దడేగ యొక చెవులపిల్లిని దన్నుకొని పోవుచుం డెను. అదిచూచి యొక పిచ్చుక "ఏమింత చేతఁగానివాఁడవీ దేగవాతఁ బడినావు. దీనిని దప్పించుకొనలేక పోతివా!" అని యూసడించెను. అంతలో మఱియొక డేగ యాపిచ్చుకను గూడ యెగరఁదన్నుకొనిపోయెను. అప్పుడా పిచ్చుక "అయ్యో నాపోత రమే గదా నన్నింతచేసెను" అని యఱచుచుఁ జచ్చెను.

గీ॥ చిక్కికొనినవాని • నక్కటికము మాని
వెక్కిరించువాఁడు • చక్కబడడు
గొప్పదేగనోటి • కుందేటి నెకసక్కె
మాడుపిచ్చికపొగ • రూడిపోదె॥

## 54. ఎండ్రకాయలు

ఒకచోట రెండెండ్రకాయలు తల్లియును బిల్లయు నడువఁ జొచ్చెను. అప్పుడాతల్లి పీత పిల్లతో "ఏమి నీకింత యాగడము! నేను నడచిన తెరువుననే నీవునుగూడ నేలనడవవు!" అని కసరెను. అందుకాపిల్ల "అమ్మా వెనుకకు నడవఁబోక ముందు నకు నడచుటీరు నీవు నాకుఁ జూపించెదవేని నటులనే నడచెదను"

అని యనెను. అప్పుడా తల్లిపీత తానుచెప్పినచొప్పునఁ దానే నడవఁజాలక సిగ్గుపడెను.

గీ॥ తనకుఁగల్గినట్టి । తప్పులేయొరులకుఁ
గలుగఁజూచిచెనఁటి । యలుగుచుండుఁ
తల్లిపీత తనదు । పిల్లను నడవడి
దిద్దుకొమ్మటంచుఁ । దిట్టలేదె॥

## ౬౫. దొంగ, పిల్లవాఁడు

ఒక దొంగ యొకచోటఁ గొంతసొమ్ము దొంగిలించుకొని యొకనూతిచెంతకు వచ్చి సొమ్ము లెక్కపెట్టుకొనుచుండెను. ఆనూతిగట్టునవేయున్న పండ్రెండేండ్ల యీడుగల పిల్లవాఁడొకఁడా దొంగను జూచి గోలుపెట్టి యేడ్వసాగెను. వానిని జూచి యాదొంగ "అబ్బాయీ యెందుకేడ్చుచున్నావు!" అని యడిగెను. అందుకా చిన్నవాఁడు "అయ్యో నాఱవయుంగరము దీనిలోఁ బడిపోయెను. నాతండ్రి నన్నుఁ గొట్టివేయును" అని వెక్కి వెక్కి మఱింత బిగ్గరగా నేడ్చెను. అప్పుడా దొంగ, యుంగరముకూడఁ దాను తీసికొనఁదలఁచి "పిల్లవాఁడా! యేడువ మానుము. గడియలో నీయుంగరము నీకుఁదీసి యిచ్చెదను. నా మూట నీగట్టుపై నుంచెదను. చూచుచుండుమా" అని నూతిలోనికి గుబ్బున నుఱికెను. తరువాత నాగడుసుపిల్లవాఁడు దొంగవాని మూటఁ దననెత్తిపై బెట్టుకొని యొక పెద్దరాయి చేతఁబట్టుకొని నూతివైపు దొంగిచూచి "ఓరీ దొంగవాఁడా! నీతీరు నేనెఱుఁగు

దును. ఉంగరమున్నదేమో దానినిగూడ నెత్తుకొని పోవఁదలఁచి నావు. కాని, వట్టిది" అనిచెప్పి తనచేతిరాయి నాలోతు నూతిలో మున్గి తేలుచున్న దొంగ నెత్తిపై నెత్తివైచి పాఱిపోయెను. పిమ్మట నాదొంగ సగముచచ్చి పైకెట్టులో వచ్చి "ఆహా! చేసి కొన్నది కుడువక తీరునా!" అని విలపించుచు బోయెను.

గీ॥ తానె టక్కరియనుతెగు • లూనియొరుని
మోసపుచ్చఁగఁ జనువాఁడు • మోసపోవు
బొల్లియేడుపునేడ్చెడు • పిల్లవాని
యుంగరముఁదీసికొనఁబోవు • దొంగచెడఁడె॥

## 56. వేలుపు, కట్టెలుకొట్టువాఁడు

ఒకఁడడవిలో నొక యేటియొద్దున నొకచెట్టు నఱకు చుండెను. అప్పుడు వాని చేతి గొడ్డలి విసరువాటున వాని చేయి దప్పి యేటిలోఁ ద్రుళ్ళి లోఁతునీటఁ బడిపోయెను. అప్పుడు వాఁడే మియును జేయఁజాలక గుండెకొట్టుకొని మొఱపెట్టసాగెను. ఆ యేడ్పు వేల్పు వినివచ్చి వాని నూరకొమ్మని యేటిలో మునిఁగి యొక బంగారు గొడ్డలిఁదీసితెచ్చి "యిదిగో నీ గొడ్డలి" అని చేతికీఁబోయెను. కాని, వాఁడది తనదికాదనెను. పిమ్మట వేల్పు రెండవసారి మునిఁగి వానియినుప గొడ్డలిఁదీసితెచ్చి పుచ్చుకొమ్మ నెను. అప్పుడు వాఁడు మిగుల వేడుకతో దానిని బుచ్చుకొనెను. అందుకు వానిని వేల్పు మెచ్చి బంగారు గొడ్డలిఁగూడ వానికిచ్చి

పోయెను. పిమ్మటవాఁడు మఱింత వేడుకతో నింటికివచ్చి యిరుగు పొరుగులతో జరిగినదంతయుఁ జెప్పెను. అదివిని యొకఁడు తానుఁగూడ నొకబంగరు గొడ్డలి తెచ్చుకొనుటకై యడవికిఁ బోయి మునుపటి చెట్టుయొద్ద నీటిలోఁ దనయినుపగొడ్డలిఁ బాఱ వైచుకొని గోలుగోలుమని యేడ్వఁదొడఁగెను. ఎప్పటివలె వేల్పు వచ్చి యొక బంగరు గొడ్డలి నీటిలోమునిఁగి తీసి "ఇదియె కాఁ బోలు నీగొడ్డలి" అని చూపించెను. అందుకు వాఁడు తొందఱతో "ఔను. నాదేనాదే" అని పుచ్చుకొనఁబోయెను. అప్పుడు వేల్పు వానితో "ఓరీ కల్లఁబోతా, నీకే గొడ్డలియును లేదుపో" అని యగ పడక పోయెను. పిమ్మట వాఁడు "అయ్యో మొదలుఁబోగొట్టు కొంటిని గదా" అని వగచుచుఁ బోయెను.

గీ॥ దబ్బరలువల్కి పెంపొందఁ • దలఁచుకల్లఁ
బోతుతప్పక మొదటికి • మోసపోవు
బొంకిబంగారుగొడ్డలిఁ • బొందఁగోరు
వట్టి చెడుగొట్టు మొదలుఁబో • గొట్టుకొనడె॥

## 57. కొయ్య దేవర

ఒకనియొద్ద నొకకొయ్య బొమ్మవేలుపుండెను. దానిని వాఁడు రేపు మాపులు తప్పక కొలుచుచుఁదనకెక్కువ సొమ్ము కలుగఁజేయుమని వేడుచుండెను. కాని, యెన్నాళ్లకైనను దన కోర్కె నా వేల్పు చెల్లింపకుండుటకు విసికి వాఁడా మొరటి దయ్యమును దుడ్డుతోఁ జిత్తుచిత్తుగాఁ గొట్టెను. అప్పుడా బొమ్మ

కడుపులో మిగుల బంగారు కాసులు దొరికెను. అదిచూచి వాఁడు "ఓ మొంది దయ్యమా నీకుఁ దగినట్లు చేసినప్పుడు కోరినదాని కంటె నెక్కువ యిచ్చినావుగదా" అని నవ్వుచు సొమ్ముతీసి దాఁచుకొనెను.

గీ॥ ఎంతబతిమాలు కొన్నఁగ • సింతవినక
మొత్తబడినప్డులొంగును • మొండివాఁడు
కొలిచివేఁడినవినకుండు • కొయ్యవేళ్ళ
మోదఁబడినప్డు బంగారు • మొత్తమిడఁడె॥

## ౬౩. గాడిదె ముద్దు

ఒకఁడొక చిన్నకుక్కపిల్లనుఁబెంచెను. అది వానితొడపైని గూర్చుండి వానిమూఁతి నాకుచు వానికి ముద్దు చూపుచుండును. అదిచూచి వానివాఁకిలి చెంత తిరుగులాడు నొక గాడిదె తనలోఁ దాను "ఓహో వీఁడీకుక్కపిల్లకింత ముద్దుచూపుచున్నాఁడు. నన్నేల ముద్దు చేయఁడు, నేనుఁగూడ దీనివలె వానిపై కెగఁ బ్రాకి తోకనాడించుచు మూఁతినాకి ముద్దు చూపెదను" అని యెంచి తోఁకమట్టనెత్తి కూయసాగి వాని యొద్దకు పరుగిడి ముందుకాళ్లు వానిపై బెట్టి ముద్దు గునువఁబోయెను. అప్పుడు వాఁడేమియును దోఁచక యొద్దనున్న వారిచే దానిని బడమోదించెను. పిమ్మట గాడిదె "అయ్యో దెబ్బలుకోని తెచ్చుకొంటిని గదా" అని యార్చుచుఁబోయెను.

గీ॥ తనకుఁదగని సాటిఁ • దలపోసిచెల్లని
పనువుచూపఁబోవు • చెనఁటిచెడును
కుక్కపిల్లసాటిఁ • గోరుచుగాడిదె
ముద్దుగునియఁబోయి • మొత్తఁబడదె॥

## 59. మేఁకపిల్ల, తోఁడేలు

ఒక మేఁకపిల్ల యింటికొప్పుపైకెక్కి క్రిందనున్న యొక తోఁడేలునుజూచి నోటికివచ్చినటు తిట్టుచుండెను. అప్పుడు తోఁడేలు దానితో "ఔరా నోటికి వచ్చినట్లెల్ల యనుచున్నావు. ఏది కాదీతప్పు నీవున్న చోటు విన్నింతచేసెను" అని పల్కిపోయెను.

గీ॥ అలఁతివానికెక్కు • వగు ప్రాపుగల్గిన
దిమ్మువట్టియొరులఁ • దిట్టుచుండు
ఇంటికొప్పుమీఁద • కెక్కితోడేటిపై
మేఁకపిల్లమిట్టి • మిట్టిపడదె॥

## 60. మిడుత, చీమ

ఒకమిడుత వేసవియందుఁ బాటుపడక హాయిగాఁ బాటల నాటలఁ బ్రొద్దుపుచ్చి పిమ్మటఁ జలిసాగినతోడనే గడగడ వడఁకుచుఁ దిండికై నలుచోట్లుచూచి యేమియుఁగానక యొక చీమల పుట్టకడకువచ్చి తనకు మేఁతకై యొకగింజ యిండవి చీమలను వేడెను. అప్పుడొకచీమ "అయ్యా కూడుకూర్చి యిప్పటికి దాఁచుకొనక వేసవినంతయు నాటపాటలఁగడపినావు. కనుక

విప్పుడు నీకుఁ గూడు పుట్టనేరదు. నీపని పస్తే" అని పుట్టలోవికిఁ బోయెను.

గీ॥ మీఁదుతలఁపుమాని • మిగుల సోమరియయి
తిరుగునట్టివాఁడు • తిన్నఁబడఁడు
కూడుకూర్చు తఱిని • గూర్చకాడుచుఁబాట
పాడుమిడుత చలిని • బస్తుపడదె॥

## 61. నక్క, కోడి

ఒక కోడి యొకపొడవు చెట్టుపైనుండి కూసెను. ఆకూఁత విని యొకనక్క యాచెట్టుదగ్గరకువచ్చి తలయెత్తి కోడితోఅన్నా విన్నెన్నాళ్ళకుఁ జూచితివి. నీకూఁత విని యెన్నియో పనుల మాను కొవి నీతో నేస్తము కట్టుకొని పోదమని వచ్చితివి. వింటివా వింత. ఇప్పుడు నక్కలు, కుక్కలు, కోళ్ళు మొదలగునవి యన్నియు నొకదానితో నొకటి చెలిమిగా నుండుటకై కట్టుబాటు చేసికొన్నవి .కాఁబట్టియే నీ నేస్తముఁగోరి వచ్చినాను. ఔను మూన్నాళ్ళ ముచ్చటగదా యీబ్రతుకు. ఇందులో మనలో మనకు జగడములేల. క్రిందికిదిగుమా నాయనా విన్నొకమాఱు ముద్దుపెట్టుకొని పోయెదను'' అని పిలిచెను. "మంచిది" అవి యాకోడి యూకొట్టుచు మెడవంచి యింకొక వైపు పరికించుచుం డెను. అప్పుడు నక్క "ఏమీా చూచుచున్నావు" అని యడిగెను. అందుకాకోడి "మఱేమియుఁగాదు కాని మనవేఁటకుక్క నేస్త ములు చూచితివా నీకొఱకు కాబోఁలు నెంత త్రొందఱగా వచ్చు

చున్నవో" అని యనెను, అది విని నక్క "ఓహో నేవిఁకఁ బాఱిపోవలెను. ఆ కట్టుబాటు వేఁటకుక్కలకుఁ దెలిసెనో లేదో" అని దబ్బున పాఱిపోయెను.

గీ॥ తగవులారులకొఱకుఁ • దాఁ జెప్పుచుండును
గాని మోసగాఁడు తానుగవఁడు
తవదు చెలిమిచేయు • మని కోడితోనక్క
మదివి వేఁటకుక్క • కదలిపోదె॥

## 62. గడ్డిమేఁటిపై నున్న కుక్క

ఒక కుక్క గడ్డిమేటిపైఁ బడుకొనెను. గడ్డి మేయుటకై యొక యెద్దక్కడికి వచ్చెను. అప్పుడాకుక్క యెద్దును గడ్డిమేయ నీక కఱవఁబోయెను. అందుకాయెద్దు నొచ్చుకొని "ఎంత యోర్వ లేనిదానవు. తినలేని మొత్తు నీకెందుకు" అని యింకొకచోటికిఁ బోయెను.

గీ॥ తనకుఁ బనికిరాని • దానినైనఁజెనఁటి
యొరులుదీయఁ జూచి • యోర్వలేఁడు
ఎద్దుగడ్డిమేటి • యొద్దకురాఁగని
కసరికసరి కుక్క • కఱవఁబోదె॥

## 63. గువ్వ, డేగ, బోయ

ఒక గువ్వ నొకడేగ తన్నుకొనిపోవుచుండెను. అప్పుడా గువ్వడేగతో "అయ్యయో తల్లికొక్కఁడను. నన్ను జంపకు"

అవి మొఱ్ఱపెట్టుకొనుచుండెను. కాని, డేగ వినకుండెను. అంతట బోయఁడొకఁడా డేగనుజూచి కోలతో నేలను గూల్చెను. పిమ్మట గువ్వ పాఱిపోయెను.

గీ॥ తనకుఁగ్రిందివానిఁ • దాఁగొట్టఁబోయినఁ
దనకుమీఁదివాఁడు • తన్నుఁగొట్టు
గువ్వనాడిసితన్ను • కావిపోవుడేగను
బోయఁడొకఁడుచంపి • పోయెఁగాదె॥

## 64. చీమ, గువ్వ

ఒక చీమ యేటఁబడి కొట్టుకొనిపోవుచుండెను. ఆమీఁద నెగిరి పోవుచున్న యొక గువ్వ యా చీమను గవికరించి ముక్కునఁ గఱచి యెత్తి యొడ్డునఁ బడవేసి యా చెంతనేయున్న యొక చెట్టుపై వాలెను, ఆ చెట్టు దిగువ నొకబోయ పొంచి యా గువ్వ మెడకురిఁ దగిలించఁబోవుచుండెను. అది చూచి యా చీమ దబ్బునవచ్చి వానిలోఁ దొడలోఁ జిటుక్కునఁ గుట్టెను. అప్పుడు వాఁడురికొయ్యను విడిచి గోకుకొనుచుండెను, అంతట గువ్వ యా చప్పుడు తెలిసికొని యెగిరిపోయెను.

గీ॥ తానొరులిఁగావవారుఁడును • దన్నుఁగాచుఁ
గానఁగవికరమెల్లెడ • మానవలయు
నీటిలోమండి తనుఁ గాచు • మేటిగువ్వ
వలనుబడనీకచీమఁ కా • పాడలేదె॥

## 65, దేగ, కాకి

ఒక దేగ యొకగొఱ్ఱెపిల్లను దన్నుకొనిపోయెను. అది యొక కాకి చూచి యా దేగవలె తాను గూడ చేయ వేడుకపడి యొక పొటేలును గోళ్ళతో నెత్తఁబోయెను. అప్పుడు దాని కాళ్ళు పొటేలు బొచ్చులోఁ జిక్కుకొనెను, గనుక పైకెగరలేక తెక్కలు విదల్చుకొనుచుండెను. అదిచూచి యా గొఱ్ఱెలకాపరి యాకాకిని బట్టి తనపిల్లల కాటకొఱ కప్పగించెను.

గీ॥ గొప్పవానిపాటిఁ • గోరి కొంచెమువాఁడు
చేతకానిపనిని • జేయఁజెడును
పెద్దదేగ గొఱ్ఱె • పిల్లనెత్తిన నది
చేయఁబోవుకాకి • చిక్కుపడదె॥

## 66. పెంపుడు చిల్క

ఒకఁడొక చిల్కను బెంచెను, అది వానివలన మిగులఁ గూర్మితోఁ జూడఁబడియును గూటినుండి తప్పుకొని యెన్నఁడు పైకిపోవుదునాయని చూచు చెట్లో యొఁకనాఁడు పెంచినవాని కన్నొఱంగి గూటినుండి తప్పించుకొని యడవికిఁ బాఱిపోయెను గాని దానివింత తీరుమాటల కలవాటుపడని యడవిపిట్టలు దానిని దమలోనికి జేరనీకుండెను. కనుక నది యొంటిగఁ దిరుగుచు గాలివానలకుఁ బాలై యాఁకలిదప్పికలకు లోనై "నన్నుఁ బెంచు వాని పాఱిపున హాయిగనుండక కోరి ముప్పుతెచ్చుకొంటినిగదా" యని విలపించెను.

గీ॥ తన్నుఁగాచువాని • దాపునువిడనాడి
తిరుగబోవువాఁడు • తిన్నబడఁడు
తన్నుఁబెంచువానిఁ • దప్పించుకొని చిల్క
పైకిఁబోయి యిదుమ • పాలఁబడదె॥

## 67. కాఁపువాడు, వాని కొడుకులు

ఒక ముసలికాఁపువాడు చచ్చిపోవునపుడు తనకొడుకులను జేరబిలిచి "అన్నలారా మనతోఁటలోఁ గొంతసొమ్ము మీకై దాఁచినాను. మీరు తోఁటను గలయఁద్రవ్వదరేని మీకది యెన్నటికైన దొరుకకమానదు" అని చెప్పెను. పిమ్మట వానికొడుకులు తండ్రి మాట చొప్పున నానాఁడుందోఁటనంతయుఁ గలయఁ ద్రవ్వుచు వచ్చిరి. అందువలనఁ దోఁట బాగుపడి యేటేట మిగులఁ బండుచువచ్చెను. అది చూచి తమ తండ్రి తమకు సొమ్మిచ్చుటను దాఁచ లేదనియుఁ దాము పాటుపడి తోఁటనంతయు నున్ని బాగుచేసికొనుటచే నింతరాబడి కలిగెననియును గాఁపు కొడుకులు తెలిసికొని మఱింత పాటుపడి బాగుపడిరి.

గీ॥ పాటుపడినట్టి వారికిఁ • జేటులేదు
సొమ్మువారికిఁగలుగు నె • చ్చోటనైనఁ
తండ్రిమాటలువిని తోఁటఁ • ద్రవ్వితవ్వి
కొడుకులందఱుఁగోరికఁ • బడయలేదె॥

## 68. ముసలివాఁడు, కొడుకులు

ఒక ముసలివానికి నేడ్గురు కొడుకులుండిరి. వారొకరితో

నొక రెల్లపుడు జగడము లాడుచువచ్చిరి. అది చూచి యా ముసలితండ్రి వారినందఱఁ జేరఁబిలిచి యొక్కొక్కని చేతికొక్కొక్క వంటకట్టెనిచ్చి విఱుచుమనెను. అప్పుడు వారందఱు వని చేతనున్న కట్టెవాఁడు చులకగా ముక్కలు చేసెను. పిమ్మట వారి తండ్రి యావిఱువఁబడిన కఱ్ఱలనే మోపుకట్టి యొక్కొక్కని విఱువుమని చెప్పెను. కాని, యొకఁడైనను మోపును వంపఁజాలకపోయెను. అంతట తండ్రి వారితో "నాయనలారా, చూచితిరా విడిగనున్నకఱ్ఱ విఱువఁబడెను. కాని కఱ్ఱలన్నియుఁ గలపి యున్నప్పుడొకరైన విఱువఁగలిగి వారు! కాఁబట్టి మీలో మీరు పోరుపెట్టుకొని విడువడునప్పుడు విడికఱ్ఱలవలె మీరు చేటుఁగొందురు. మీరందఱును గలిసి పొత్తుగానున్నయెడ మీకెవ్వరును గీడుగులుగఁజేయనేరరు" అని చెప్పి యొప్పించెను.

గీ॥ కూడికట్టుకటు • కొని యుండువారల
కెందునైనఁగీడు • చెందఁబోదు
ఒంటివిఱువఁబడిన • వంటకట్టెలుకట
పెనపియున్నయపుడు • విఱువఁబడెనె॥

## 69. ఏదుపంది, పాములు

ఒక యేదుపంది యుండఁజోటులేక పాముల బొరియయొద్దకు పోయి యాపాములను దనకు చోటిమ్మని వేడుకొనెను. అందుకాపాములు వల్లెయని దానిని దమయింటనుండ నిచ్చెను. పిమ్మట యేదుపంది తనముళ్ళు విప్పి చెలరేగి తిరుగఁజొచ్చెను.

అప్పుడు పాములన్నియు "ఏమిది నీవలన మాకుఁ జాలా యిబ్బంది కలుగుచున్నది" అని యేదుపందితో ననెను. అదివిని యా పంది "సరిసరి యెవరికిబ్బంది. నేను హాయిగానే యున్నాను. ఇబ్బంది గలవారిక్కడ నేల యుందురు!" అని గదిమెను.

గీ॥ క్రొత్తనేస్తకాని • గుట్టెఱుంగక వమ్మి
యిరవు నిచ్చువారు • చెఱుపుగొందు
రేదుపందితోడ • నెవసి పాములు తమ
యిల్లునిచ్చిపిదప • విడుమఁ గొనవె॥

## 70. అలఁకాపరి. పులి

ఒకఁడావులను బీడుపై మేపుచు నవ్వులాటకై పులిపులి యని యఱచుచుండువాఁడు. అదివిని చెంతనున్నవారు పరుగిడుచు వచ్చువారు. అదిచూచి వాఁడు "లేదు నవ్వులాటకై యట్లంటిని" అని చెప్పుచువచ్చెను. ఇట్లు కొన్నాళ్ళు జరుగఁగా నొకనాఁడు నిక్కముగాఁ బులియేవచ్చెను. అప్పుడు వాఁడు మునపటివలెఁ బులిపులి యని కూయసాగెను. చుట్టుప్రక్కల నున్నవారలెప్పటి యఱపేగదా యని యూరకుండిరి. అంతట వానిని బులి యెత్తుకొనిపోయెను.

గీ॥ నవ్వులాటకనుచు • నలుగురితోఁగల్ల
చెప్పునట్టివాఁడు • ముప్పుఁబొందుఁ
బొలములోనఁబెద్ద • పులిదిగె ననిబొంకు
లాడుకాఁపు తుదకు • కీడు గనఁడె॥

## 71. చెవులపిల్లి, తాఁబేలు

ఒక కుందేలొక తాఁబేలుతో "ఓయీ కదలలేవు. మెదల లేవు. నాతోఁ బరుగెత్తఁగలవా ఆ కనుపడుచున్న చెరువునీరు ముందెవరు త్రాగెదరో పందెము వేసికొందమా" అని యెగతా ళిగాఁ బలికెను. అందుకాతాఁబేలు చిన్నబోయి "నీతో బరుగెత్తఁ గలనా! కాని చూచెదము" అని చెర్వుకడకు గుసగుసలాడుచుఁ బ్రాకసాగెను. అప్పుడా చెవులపిల్లి "ఇదెంతపని యొక్కడాఁ టునఁ జేరెదను. దీనివలెనే ప్రాక వక్కఱలేదు గదా. కొంచెము హాయిగాఁ బండుకొని పిమ్మట దీని నోడించెదను. ఇహిహి యదెట్లు ప్రాఁకులాడుచున్నదో" అని నవ్వుకొనుచుఁ జెంతనున్న యొకపొదలోఁ బడుకొనెను. పిమ్మటఁ గొంతసేపటి కా తాఁబేలు చెర్వుకడకు చేరి వెన్కఁ దిరిగి చూచి కుందేలు రాకుడుటకుఁ బొంగుచు నీటిలోఁ జొఱఁబడెను. మఱికొంత తడవునకుఁ బొదలోఁగూర్కు పెట్టుచున్న కుందేలు మేల్కని కన్నులునులిమి కొనుచుఁ జెంగుచెంగున దాఁటి చెరువుదాఁపునకు వచ్చెను. అప్పు డదివఱకే చెర్వునీటిలోఁ జొచ్చినతాఁబేలు కుందేటినిఁజూచి "ఓహో పడుకొన్నావా! పందెము మాట మఱచినట్లున్నది. ఇఁక నెన్నటికిని నావంటి చేతకానివాని నెకసక్కెమాడకు" మని సిగ్గు పడునట్లు చెప్పెను.

గీ॥ చేయలేకపోదు – నాయనిజాగును
చేయువాఁడుపనిని, జేయలేఁడు

చెవులపిల్లి తడవు, సేసి తాఁబేటితోఁ
బన్నిదంబువేసి తిన్నఁబడెనె॥

## 72. అంగూరుతోఁట, లేడి

కొందఱొక లేడిని వేటాడఁజొచ్చిరి. అది నలువైపులఁ బరుగిడుచుఁ దుదకొక దాకతోఁటలో దాఁగుఁకొనెను. పిమ్మట వారు దానికొఱకంతట వెదకుచుఁ గానక పోయినదనుకొని యా అంగూరుతోఁటప్రక్కతోవనే పోవుచుండిరి. అంతట లేడి జంకు తీరి మెల్లమెల్లగా దాకయాకులను నమలసాగెను. ఆ సడిఁగని పెట్టి యా వేటకాండ్రు లేడి యక్కడనున్నదని యెంచి గుండు తోఁ గొట్టిరి. ఆ దెబ్బతిని యాలేడి "అయ్యో నన్ను దాఁచిన అంగూరునే మేయుటచేతఁగదా నాకింతమూడెను." అని యేడ్చుచుఁ జచ్చెను.

గీ॥ తన్నుఁగాపాడు వానికిఁ దగిలి కీడు
చేయువాఁడు తనంత నె చేటుఁబొందుఁ
దన్నుబ్రతికించిగాచిన దాకయాక
మేయసాగినలేడి చా నేయఁబడదె॥

## 73. తాగుఁబోతు

ఒకఁడు త్రాగుఁబోతయి యొడలెఱుఁగక తిరుగుచుండెను. వానియాలు వానికెంత మంచిగా చెప్పినను వాఁడు వినకుండెను. అధియొకనాఁడు వాఁడు తాగి క్రిందఁబడి పొర్లుటఁజూచి వానిని

గాటియొద్దకుఁ గొనిపోయి గోతిలో దిగ విడిచి యొద్దుననే కూర్చుండెను. పిమ్మట వాఁడు కొంత సేపటికి గొంతెండిపోవుచున్నదని యఱచెను. అప్పుడామె "యేమికావలె" నని యడిగెను. అదివిని వాఁడు "మఱేమియు నక్కఱలేదు. కాని బిడ్డెఁడు కల్లిచ్చెదవా" అనివేడెను అందుకు నవ్వియామె "గోతఁబెట్టియైన నిన్నుఁ గుదుర్చలేక పోతినిగదా" యని వానినింటికిఁ దోడ్కొనిపోయెను.

గీ॥ తగనియలవాటువడిహద్దు । మిగిలి నట్టి
వానిమరలింప నెవ్వారి । వశముగాదు
గోతిలోఁ బెట్టియైనను । నాతిమగని
త్రాగుఁబోతుదనమునకు । బాగుగవెనె॥

## 74. గొడ్డలివంతు

ఇద్దఱొక యడవిలో నడచుచుండిరి. వారిలో నొకఁడా దారిలో నొకగొడ్డలినిజూచి "ఇదిగో నాకొక గొడ్డలి దొరికెను" అనెను. తక్కినవాఁడు వానితో "మనకొక గొడ్డలి దొఱికెననుము" అని తనకు వంతిమ్మనెను. అందుకు రెండవ వాఁడొప్పుకొనక జగడమాడుచుండెను. ఇట్లుండఁగా గొడ్డలి వాఁడు "ఎవఁడది నా గొడ్డలి నెత్తికొని పోవుచున్నాఁడు!" అని కేకలువేయుచు వచ్చుచుండెను. అప్పుడు గొడ్డలినంకించు కొన్నవాఁడు రెండవ వానితో "ఓరీ మనపైకెవఁడో పోట్లాటకు వచ్చుచున్నాఁడు. ఈ గొడ్డలి వాఁడు కాఁబోలు" అని యా గొడ్డలిని గ్రిందఁబడ

వేసెను. అదివిని రెండవవాఁడు "నీతోఁ బోట్లాటకు వచ్చుచున్నాఁడు గాని నాతోఁగాదుఁ గొడ్డలి నీకుఁగదా దొఱికెను" అనెను. అంతట గొడ్డలివాఁడా యిద్దరకును జెరియొక చెంప పెట్టుపెట్టి గొడ్డలిని దీసికొని పోయెను. అప్పుడు వారిద్దఱు నొకనితో నొకరు "అయ్యో సన్నసన్నగా గొడ్డలిని వంతుపంచి పెట్టుకొనక జగడమాడి దెబ్బలవంతు తెచ్చుకొంటిమి గదా' అని వగచుచుఁ బోయిరి.

గీ॥ మంచిపెద్దలొక్క • మాఢ్కిన జెలికాండ్రు
వంతుపంచుకొనక • బాగుపడరు
దారిపడచుఱట్టు • దారులు గొడ్డలి
కొఱకుపోరిచెంప • పెట్లుతినరె॥

## 75. బెస్తవాఁడు

చేఁపలు పట్టువాఁడొకఁడు నీళ్ళరేవున కెగువఁ జేఁపలు పట్టుటకై నీరరికట్టి కలంచుచుండెను. క్రిందిరేవున నున్నవారందఱంత చెప్పినను మానక "నాకుఁ దోఁచినట్లు నేఁజేసెదను. నేఁ జేఁపలు పట్టకుండ నడ్డుటకు మీరెవ్వరు!" ని కసరెను.

గీ॥ తనకుమేలుకలుగు • నని పయివారికిఁ
జెఱుపుసేయుచుండుఁ • జెనఁటివాఁడు
మీను దొఱకునంచు • మీఁదిరేవువవీరు
బెస్తవాఁడు కలియఁ • బెట్టపోఁడె॥

## 76. కోడిపెట్ట, పాముగ్రుడ్లు

ఒకకోడిపెట్ట కొన్ని పాముగుడ్లను బొదిగి పిల్లలు చేసెను. ఆపిల్లలా కోడినే కఱచి చంపెను.

గీ బాగుచేసినట్టి • వానిమేలెంచక
చెడ్డవారువానిఁ • జెఱచుచుందు
కోడిబొదుగఁబాము • గుడ్డులు పిల్లలై
పెంపుమఱచి దానిఁ • జంపిపోవె॥

## 77. ఒట్టు

ఇద్దఱు కుఱ్ఱవాండ్రొక కజ్జమువాని దుకాణమునకుఁ బోయి బేరము చేయుచున్నట్లు మాట్లాడుచుండిరి. వారిలో నొకఁడు రెండవవాని చేతికి సన్నసన్నగా నొక యప్పము నిచ్చెను, వాఁడు తన కచ్చులో దానిని దాఁచెను. అంతట నాయంగడి వాఁడు తన యప్పములు లెక్కపెట్టుకొని యొకటిఁ గావక యా పిల్లల వైపుతిరిగి "యేదీ నాయప్పము దొంగలించినారా" అని కసు లెత్తి చేసెను. అప్పుడు యప్పము దీసినవాఁడు తనయొద్ద నప్పము లేదనియు రెండవవాఁడు తానాయప్పము దిన లేద నియు నొట్టుపెట్టుకొనిరి. ఆ మాటలు విని యంగడివాఁడు "మీయొట్లు చెల్లనేరవు, మీ మాటలే మీరు దొంగలని చెప్పు చున్నవి." అని వారిబట్టలు తడిమి తనయప్పమును లాగుకొనెను.

గీ॥ మొనసియానలుపైఁబెట్ట • కొనెడివారి
కల్ల లిసుమంతయైనను • జెల్లఁబోవు

ఒదిగియప్పము దొంగిలి • యొట్టువేసి
కొన్నబుడుతలదబ్బఱ • లెన్నబడెనె॥

## 78. దారికడ్డరాయి

ఒకచో నీళ్ళరేవునకుఁబోవు దారికడ్డముగ నొకరాయి యుండెను. అది కాళ్ళకుదగిలి రేవునకుఁ బోవువారందఱును బడుచువచ్చిరి. ఒకడు దానిని బెఱికి యా దారిలోనుండి తొలగించి పాఱవేసెను. పిమ్మట వానినందఱును మెచ్చిరి.

గీ॥ దారికడ్డమైన • దానినినేర్పరి
మిగులఁదొలఁగఁద్రోసి • పొగడఁబడును
నీళ్ళరేవుచెంతఁ గాళ్ళ • కడ్డగురాయి
బెఱికివైచువాఁడు • పెంపుఁగనఁడె॥

## 79. మున్నీరు త్రాగుట

ఒక చదువుకొన్నవాఁడు కల్లుఁద్రాగి యొడలు మఱచి "నేఁద్రాగినంత నెవరైనఁ ద్రాగఁగలరా?" యని యఱచుచుండెను. అప్పుడొకఁడు వచ్చి "అయ్యా! యీ యూరిలో నందఱ కన్నను మీరు గొప్పవారై యుండియు నేమిటికిట్లు మాటలాడుచున్నారు. ఎంత త్రాగఁగలరు!" అని యడిగెను. ఆ మాటకా త్రాగుఁబోతు పెద్ద "కడలినైన నొక్క గుక్కలోఁ ద్రాగెదను. వీరియెదుటఁ బందెము వేసెదవా! తిరిగిఁ జెప్పు. సన్నెఱుఁగవా!" అని యందరియెదుటను దాను మఱునాఁడు సముద్రమును ద్రాగు

టకుఁ బందెమొప్పుకొనెను. మఱునాఁడందఱును వింతఁజూచుటకై మూఁకమూఁకలుఁగ మున్నీటి దగ్గరకుఁబోయిరి. అప్పుడా చదువు కొన్నవాఁడేమియుఁ దోచక తన నెచ్చలికాని యొద్దకుఁబోయి "ఓరి యేమి వేయుదును! నేనేమన్నానో నాకుఁ దెలియదు. ఇప్పుడు నేను కడలిని ద్రాగవలెనఁట. అట్లు చేయకుండినచో జరిగిన మాటచొప్పున నా యిల్లు పుచ్చుకొనెదరఁట. నాకేమిదారి!" అని మొత్తు పెట్టెను. అందుకానేస్తకాఁడు "జడియకు. కడలి చెంతకుఁబోవుదము రా. ఏటినీరు కలియని యచ్చకడలి నీరిచ్చినచో మున్నీటి నంతయుఁ ద్రాగెదనుము. కడలినీరంతయుఁ ద్రాగుటకుఁ గదా పందెము వేసితివి" అని యెత్తుచెప్పి వారి నందఱు యెదుటకుఁ దీసికొనిపోయి తాను జెప్పినట్లనిపించెను. అప్పుడందఱును మఱేమియు ననలేక నవ్వుకొనుచుఁ బోయిరి.

గీ॥ ఒడలెఱుంగక త్రాగిన • వెడగు తనకు
చేతికానట్టి పనులను • జేయఁబోవు
తమ్ముఁదాఁదెలియకయున్న • త్రాగుఁబోతు
తగిలి మున్నీటి నెంతయుఁ • దాగఁబోఁడె॥

## 80. రొట్టె గంప.

ఒకఁడూరికిఁ బ్రోవనెట్టుకొని యిరువురు కూలివాండ్రను బిలిచి "యీబంగారు పెట్టె నొకఁడును, ఈ రొట్టెగంప నొకఁడును మోసికొనిరండు" అని చెప్పెను బంగారు పెట్టె మోయుటకై వేడుకపడి దబ్బున నొకకూలివాఁడు దానినెత్తుకొనెను. రెం

డవవాఁడు కిటుకు తెలిసికొని రొట్టెగంపను దానెత్తుకొనెను. పిమ్మట నానాటికి రొట్టెగంప తఱుగుచు వచ్చి దానిమోయువానికి మిగుల (జులకన యయ్యెను.

గీ॥ ఓర్పిమీఁదు తెలిసి • యుండెడువానికిఁ॥
గలుగుచిక్కు దుదకు • (గలఁగఁబోదు
రొట్టెగంపమోయు • వట్టివానికినది
యరుగనరుగఁ(జులక • నయ్యెఁగాదె॥

## 81. పొడుము డబ్బి - ముక్కుద్దము

ఒక ముసలివాఁడు చదివిచదివి పొడుముపట్టుపట్టి డబ్బిపై ముక్కుద్దముంచి పీల్చుకొనుచుండెను. అంతటఁ పొడుము డబ్బి ముక్కుద్దముతో "చాలుఁజాలుఁ-దిగుదిగు-వానికిఁ దెలియదుగాని నీ వెఱుఁగవా! నాకంటె నీ గొప్పయేమి! ఇదిగో చూడు నాపని వచ్చినప్పుడు విన్నెలాగూడలాగినాఁడో - నేనేలేకున్నచో వానికి దెలివియెక్కడ!" అని గద్దించెను. అదివిని ముక్కుద్దము "కూయకు కూయకు నేనేలేకున్నచో వాఁడు చూచుటెట్లు! పనిలేక విన్నలవాటు చేసికొన్నాఁడు నీ కంపునకు నీ సొంపునకుఁదోడు నీకుఁ బెద్దమాటలేల!" అని బదులు చెప్పెను.

గీ॥ నేనెగొప్పనాకు • నేనెగొప్పయటంచుఁ
దవిలిపోరుచుందు • తగవిదాంద్రు
మొనసిపొడుముడబ్బి • యును గంటిజోడును
వట్టిజగడమాడ • నెట్టుకొనవె॥

## 82. మేఁక పెంచిన గొఱ్ఱెపిల్ల

ఒక నక్క మేఁకలమందకుఁబోయి చుట్టు తిరుగఁజొచ్చెను. మేఁకపోతులు కాచుకొనియుండుటచే దానికి వీలుకాలేదు. అప్పుడది యామందలో మెసఁగుచున్న యొక గొఱ్ఱెపిల్లను జూచి "ఎంతతెలివిమాలినదానవు - నీ తల్లివిడిచి యిక్కడెందుకున్నావు - నీ తల్లియొద్దకు నిన్ను దిగబెట్టెదను రా" అనిపిలిచెను. ఆమాటకాగొఱ్ఱెపిల్ల "కొంటెనక్కా నీనెనరు నాకెఱుక, అయిన నడిగితివి కనుకఁ జెప్పెదవిను. నన్నుఁగన్న దెవతెయైనను నన్నుఁబెంచిన మేఁకయే నాకు నిక్కమగు తల్లికదా" అని తెలియఁబలికెను.

గీ॥ మంచివాఁడుతన్నుఁ • బెంచినతల్లిని
గన్నతల్లికన్న • గడనసేయు
గొఱ్ఱెపిల్లతన్ను • ఁగొవిపెంచుమేఁకను
గన్నతల్లికన్న • నెన్నలేదె॥

## 83. జబ్బుపడినగద్ద

ఒకగద్ద దానిచిన్నతనమునఁ దప్పులఁజేసిచేసి తుదకు ముసలితనమునందు మిగుల జబ్బుతోఁ దీసికొనుచుఁ దనకన్న మగ గద్దను బిలిచి "అన్నా చూచుచున్నావుగదా - నా జబ్బు పూటపూటకుఁ బెరుఁగుచుంట! నాచిన్నవాఁడు నేనునడచిన తప్పు వడత వాకింతచేసెను. ఈ దాపుననేయున్న వేల్పుగుడియొద్దకుఁ

బోయి నా తప్పులను మన్నించి నాజబ్బుఁగుదిర్చి నన్నుఁ గాపాడుమని నామనవిగా వేఁడుకొని రమ్ము" అని చెప్పిపంపించెను. తండ్రి చెప్పినతీరునఁ జిన్నగద్ద గుడికిఁబోయి వేల్పుతో మనవి చేసెను. అందుకు వేల్పు "ఓరీ చేసికొన్నది కుడువక తీరదని నీతండ్రితోఁ జెప్పుపో" అని సెలవిచ్చెను.

గీ॥ తెలిసియును దప్పుదారిని • దిరిగిముప్పుఁ
బొందువానిని గావంగఁ • బోవరెవరు
తప్పువదతలజబ్బునఁ • దగులఁగద్ద
కావుమనివేఁడ వేలుపు • కావఁజనెనె॥

## 84. చెట్లు, చెట్లు నఱకువాఁడు

ఒకఁ డడవికిఁబోయి తనగొడ్డలికొక కామవిమ్మని చెట్లను వేఁడెను. "ఇదెంతపని" యని యని వానికొక చేవకొయ్య నిచ్చెను. దానిని వాఁడు తనగొడ్డలికమర్చి యా చెట్లనే నఱకఁ జొచ్చెను. అదిచూచి యాచెట్లన్నియు "అయ్యో మన మేలుపెట్టి మనకన్నే పొడుచుచున్నాఁడు" అని వగవసాగెను.

గీ॥ వగతుఁడైనవానిఁ • బరికింపలేకమేల్
సేయునట్టివారు • చేటుఁగొందురి
గుట్టుతెలియలేక • గొడ్డలి కొఱకునిక్క-
పట్టువిచ్చుచెట్లు • పాట్లు పడవె॥

## ౮౫. వేలుపు, ఒంటె

ఒక లొట్టిపిట్ట వేల్పుతో "ఇంత పెద్దదానిగా నన్నుఁ బుట్టించినావు కాని నాకంటెఁ బదింతలు చిన్నదైన చిట్టపులికిఁ గూడ నేవెఱవవలసి వచ్చెను. గోళ్లు, కోఱలు లేనందునఁగదా నాకింతకష్టైను. కాఁబట్టి నన్ను మన్నించి పులికివలె గోళ్లు కోఱలు నెనుమువలె గొమ్ములనుగూడ నాకీరాదా" అని వేఁడెను. అది విని వేల్పు "ఓలొట్టియా! ఉన్నదానితోఁదనివియక యన్నిటికంటె నెక్కువగా నుండఁగోరితివి కనుక నీకింతటినుండి చెవులుకూడ మొండియగును" అని సెల విచ్చెను.

గీ॥ పొందఁజాలనికోర్కెను • బొందఁగోరు
నట్టివాఁడుండునదిచెడ • ఁగొట్టుకొనును
గోళ్లగోఱలుగొమ్ములుం • గోరియొంటె
చెవులరెంటనుదా మొండి • చేసికొనదె॥

## ౮౬. ఎద్దు, దూడ

ఒకదూడ దున్నుకొనుచున్న యెద్దునుజూచి చెంగుచెంగున దాఁటుచు "చీచీ యీ కూలిబ్రతుకు బ్రతుకుటకన్న చావుమేలు. చూడు నా మెడకు మువ్వలుకట్టి నన్నెంత ముద్దుసేయుచున్నారో" అని పోతరముగాఁ బలికెను. అందుకేమియు ననఁజాలక యెద్దు తలవంచుకొని పనిసేయసాగెను. మఱికొన్నాళ్లకా దూడను గల వాఁరు దానిని దనయూరియమ్మ వారికి వేఁట మ్రొక్కుకొని గుడికిఁదీసికొని పోవుచుండెను. ఆ యెద్దుకూడ పొలమునకా దారి

నేఁబోవుచు దూడతో "ఓరీ యింక చూచుకో నీ ముద్దు-మఱియొక గడియలో నిన్ను గొడ్డలి ముద్దు పెట్టుకొనును. పాటుపడు పెద్దల నీసడించి నీవేమి తిన్నఁబడితివి" అని యెత్తిపొడిచెను.

గీ॥ పాటుపడెడుమంచి • వానితోనెగసక్కె
మాడువాఁడుతుదకుఁ • గీడుఁబొందు
దున్నకొనుచుబ్రతుకు • చున్నట్టియెద్దు నీ
పడముపేయుదూడ • యిడుమఁగొనదె॥

## 87. గాడిదె, కాఁపు

ఒకనియొద్ద నొక పెంకిగాడిదె యుండెను. ఒకనాఁడది వానికి లొంగక పరుగిడుచుండెను. అప్పుడువాఁడు దానితోఁకఁ బట్టుకొని మఱలించుటకై కొట్టుచుండెను; కాని యదిమరలక యొకగుట్టపైకెక్కి క్రిందికుఱుకఁబూనెను. అదిచూచి వాఁడు "ఓ పాడుగాడిదె నాకు లోఁబడక చావునకు లోఁబడెదవా!" అని దానితోఁకవిడిచెను. అంతట నది గుట్టక్రింది కుఱికి చచ్చెను.

గీ॥ కపికరమునఁదన్ను • గావంగఁబూనిన
వానిమాటవినని • వాఁడుచెడును
తన్నుఁగాచువాని • నెన్నకగాడిదె
గుట్టక్రిందికుఱికి • గిట్టలేదె॥

## 88. గాడిదె, సింగము

ఒకగాడిదె యొకసింగముతో నెయ్యమ్ముగానుండెను. ఒకనాఁ

ధాటింగము. గాడిదెతో "నీవాడొంకలో దాఁగుకొని యన్నియును బెదిరి పరుగిడునట్లు అఱుము. నావిచ్చలవిడిగా నేవేఁటాడెదను" అని చెప్పెను. పిమ్మట నాగాలిగాఁడు తెగఁగూసి యన్నిటిని బెదరించి యదంతయుఁ దన గొప్పయేయని సింగముతో బడాయి కొట్టెను. అందుకు తెలిమెకము నవ్వెను.

గీ॥ ఒరులఁతమ్ముఁదెలియ • కున్నప్డుఁపట్ట బ
గ్గాలులేకచెనఁటి • పేర్మిఁజుండు
డొంకమందిపులుల • జంకించిగాడిదె
కూసిగోటుచెప్ప • కొనఁగలేదె॥

## ౮౨. మేఁకపోతు, సింగము

ఒకమేఁకపోతు సూదికొండపై మేయుచుండెను, ఆకొండ క్రింది త్రోవలో నొకసింగము చెరలాడుచు మేఁకపోతుతో "మేఁకనేస్తమా గుట్టరాతిమీఁద నీకేమిమేతకద్దు! క్రిందికిదిగి నాతోఁగలిసి తిరుగరాదా హాయిగానుందము" అని యిచ్చకముగాఁ బిలిచెను. అందుకామేఁకపోతు "ఓహో నీతో నాకు నేస్తమా కొఱవితో నెత్తిగోకుకొన్నట్లే; యీసవతితల్లి వెనరు నాకుఁదెలియదా" అని తెలియఁజెప్పెను.

గీ॥ తెరిపిసెప్పువాని • తెమ్మనుబరికించి
తెలివిగలుగువాఁడు • తిరుగుచుండుఁ
కొండదిగుమటంచుఁ • గొదమసింగముతన్నుఁ
బిలువమేఁకపోతు • వినివయ్యదియె॥

## 90. కోఁతి, దొర

ఒక యడవిలో నొకతోఁకలేనికోఁతిని దక్కినవన్నియును దను కేలికగాఁ జేసికొనెను. అందుకున్ని యావాలిఁడి పిచ్చలవిడి విఱ్ఱవీగి తిరుగఁజొచ్చెను. ఇట్లు కొన్నాళ్ళుగడవఁగా నొకనాఁడా కోఁతి వేఁటకాని బోనునఁజిక్కుకొనెను. అదిచూచి యొకనక్క దానితో "ఓకోఁతీ బోను చిక్కు తెలిసికొనఁజాలని నీవేలాటి దొరవు" అని యాసడించెను.

గీ॥ తనకు తగనియట్టి • పని సేయఁబూనిన
చేతికానివాఁడు • చేటుఁబొందు
తోఁకలేనికోఁతి • దొరయయిచెలరేఁగి
బోనులోనఁజిక్కి • పొలసిపోదె॥

## 91. దొంగ, కుక్క

ఒకయింట నొకదొంగవచ్చెను. అక్కడఁ గావలియున్న కుక్క వానినిఁజూచి యఱచెను. అప్పుడాదొంగ దానియొద్ద నొక చిన్న రొట్టెముక్కఁ బడవైచి బెల్లించెను. అదిచూచి యాకుక్క వానిని దప్పక దొంగయనియెంచి మఱింత వడిగా నఱచి వానిని దఱిమెను.

గీ॥ చూచునంతలోన • ఁజుట్టఱికముఁజూపు
వానినెఱుఁగునేతు • పైనవాఁడు
రొట్టెలంచమిచ్చు • పట్టివానినిదొంగ
యనుచుఁగాఁపుకుక్క • యఱవలేదె॥

## 92. బయకాఁడు

ఒకయూరిలో నొక పాటనేర్చినవాఁడుండెను. వానికిఁ దాగ్రిగుఁబోతులతోఁబొత్తు. ఆతాగ్రిగుఁబోతులు వానినిమిగుల మెచ్చుచు వచ్చిరి. అందుకుఁ బొంగి యతఁడు తనంతవాఁడులేఁడని బడాయి చెప్పుకొనుచు వచ్చెను. మఱికొన్నాళ్ళకా యూరిపెద్ద వానిని బిలిపించి కొలువుచేసెను. ఆక్కడ వాఁడు నోరెత్తఁ జాలక చిన్నబోయెను.

గీ॥ వనికిరావిమూఁక • తమఁగొనియాడఁగ
విఱ్ఱవీగువట్టి • వెఱ్ఱిచెరుకు
త్రాగుఁబోతులెల్ల • తన్ను మెచ్చఁగ నబ్బి
తిరుగుపాటగాఁడు • తిన్నఁబడెను॥

## 93. కోడి, సింగము, గాడిదె.

ఒక కొండయొద్ద నొక కోడియు, నొక గాడిదెయును మేయుచుండెను. అప్పుడా కోడికూసెను. ఆకూఁత విని యాచెంతనున్న యొక సింగము బెదరి పరుగిడుచుండెను. అదిచూచి గాడిదె తమ్ముఁ జూచి సింగము జడిసె ననుకొని దానివెంటఁదగులఁబోయెను. అప్పుడు సింగము "ఓసాదుగొడ్డా నీబ్రతుకునకుఁ దోడునన్నుఁ దఱుమవచ్చితివా" అని పట్టి చంపెను

గీ॥ అంతరువెఱింగికొనియుఁద • నంతఁబోక
గోటుమాపెడువాఁడుదాఁ • జేటుఁబొందుఁ

కోడికదరినసింగము • నోరఁబుచ్చఁ
దెంపుచేసిన గాడిదె • చంపఁబడదె॥

## 94. గూడకొంగ

ఒక వరిపొలములోఁ గొన్ని పొట్టిబాతులు చేనిగిఁజలూడు చుండెను. అందులో నొకగూడకొంగ కూడ చేఁపలకై తిరుగు చుండెను. ఆపొలముకాఁపు వలఁబన్నెను. అవియన్నియు గూడకొంగతోఁగూడ వలలోఁ జిక్కుకొనెను. అప్పుడు వాఁడు పొట్టిబాతుల నన్నిటిని జంపి గూడకొంగనుబట్టి చంపఁబోయెను. అప్పుడాగూడకొంగ వానితో "అయ్యా నన్ను విడువుము. నేను చేపలకై వచ్చితిఁగాని యిఁకొకటికాదు" అని వేఁడెను. అందుకు వాఁడు "ఓకొంగా, నిన్నుపట్టికాదు నీజట్టునుబట్టి నిన్నుఁ జంపవలసివచ్చెను." అని చంపెను.

గీ॥ చెడ్డవాండ్రినడుమఁ • జేరునప్పుడుదొడ్డ
వాఁడుకూడవారి • తోడఁజెడును
వరివిమెసవుపొట్టి • బాతులతోఁగూడ
గూడకొంగయసురు • గోలుపోదె॥

## 95. నక్క, తోఁడేలు

ఒక గొల్లవాని మందచెంత నొకతోఁడేలు దాగుకొని యుండెను. అది చూచి యొకనక్క యాగొల్లవానితో "ఓయీ నీగొఱ్ఱెల నెత్తికొనిపోవు తోఁడేలదిగో ఆపొదలో దాగుకొన్నది"

అని చెప్పెను. అంతట వాఁడాతోఁడేలును దుడ్డుతో మొత్తిచంపి యానక్కను గూడ చంపెను.

గీ॥ ఓర్వలేమితోడ • నొరులపైఁగొండెంబు
చెప్పిచెఱుపువాఁడు • ముప్పుఁబొందుఁ
చెనఁటినక్కగొల్ల • చేతనుదోడేటి
మక్కడంగఁజేసి • చక్కబడెనె॥

## 96. కోతి ప్రాపు

ఒకఁడొక కోఁతిని బెంచెను. అదివానిని విడువక కొలిచుచుండెను. వాఁడొకనాడుపడుకొనియున్నపుడువానిపై నొక యీఁగ వాలెను. అది చూచియా కోఁతి యీఁగను దోలుచువచ్చెను. గాని యీఁగ విడువక వాలుచుండెను. అందు కలిగి కోఁతి యీఁగను జంపఁబోయి రాతితో, దన్నుఁ బెంచినవానికిఁ బెద్ద దెబ్బవేసెను. ఆ రాతిదెబ్బకతతకుఁ దగుల వాడు చచ్చెను.

గీ॥ మోటువానిపొందు • ముప్పునకగునంచుఁ
దెలివిఁగొనవివాఁడు • పొలసిపోవు
కోఁతిపొత్తునమ్మి • కొని పరాకుననుండు
వాఁడుదానివలనఁ • గీడుగనఁడె॥

## 97. ఉప్పుమోయు గాడిదె

ఒకఁడు సంతలో నుప్పుఁగొని గంతలోఁబోసి గాడిదెపై

నెత్తి తోలుకొని యింటికిఁ బోవుచుండెను ఆ దారిలో నొక కాలువ పాఱుచుండెను. ఆగాడిదె కాలు జారి యాకాలువలోఁ బడెను. అప్పుడుప్పుకరఁగి పోయెను. పిమ్మట గాడిదె బరువు చులకవడి చెలరేఁగి పరుగిడి యిల్లు చేరెను. మఱియొకనాఁడు మునుపటివలె గాడిదె యుప్పుగంత మోయుచుఁ గాలువలో వడచునపుడు కాలుజాఱిపడినట్టులుప్పుగంతకోరి నీటిలో ద్రోసివైచెను. ఆయుప్పెల్లఁగరఁగి బరువు చులకపడెను. ఇట్లు తన యుప్పు చెడుటఁజూచి వాఁడది తనగాడిదె చేసినపనియని తెలిసికొని మఱియొకనాఁడాగాడిదపై దూదినిండిన గంతను వేసి యా కాలువనుండి తోలుచుండెను. అప్పుడాగాడిదె తనబరువును మునుపటివలె మఱింత చులకపఱుచఁదలఁచి నీటిలోఁబడి దొర్లెను. పిమ్మట దూదియంతయు నీటిలోఁదడిసి బిగిసి నూఱురెట్లు బరువాయెను. అది మోయఁజాలక గాడిదె పదదెబ్బలు తిని "చేసికొన్నది కుడువక తీరునా" అని వగచెను.

గీ॥ చేయవలయుదానిఁ । జేయకతామావఁ
బూనునట్టివాఁడు । మోసపోవు
ఉప్పుగంతబరువుఁ । దప్పించిగాడిదె
దూదిగోనెతడిపి । తొట్రుపడదె॥

## 98. బంగారు పిచ్చుక, కోఁతి

ఒకప్పుడొకకోఁతి వానకుఁ దడిసి వడవడవడఁకుచుఁ బండ్లు గీఁటుకొనుచు నొక కొబ్బరిచెట్టుక్రిందఁ గూర్చుండెను,

ఆ చెట్టుపైని మిద్దెవలె గూడుకట్టుకొని వెచ్చగా, బదుకొన్న యొక బంగారు పిచ్చుక యాకోఁతిని జూచి "అయ్యా మానిసి వలెఁ గాలుచేతులు కలిగినవాఁడవు. చిన్న యిల్లు కట్టుకొనరాదా! అప్పుడు హాయిగనుఁదువుగదా చూడుమా-పిట్టను నేను ఎంద కెండను, వానకుఁదడియను, గాలికిరాలను- ఇదిగో నా యిల్లు- ఎంతహాయిగామన్నాను. నావలె నీవేలఁ జేయఁగూడదు!" అని తెరువు చెప్పెను. కోఁతి మండిపడి యా పిచ్చుక గూడు పెఱికివైచెను.

గీ॥ చెడ్డవానికి తెరవు జెప్పఁబోవు
వాఁడు మంచికిమాఱుగఁ గీడుఁజొందుఁ
బ్రాలుమాలిన కోఁతికి మేలు తెలుపఁ
బోవు బంగరుపిచ్చుక మోసపోదె॥

## 99. కోఁతి, పిల్లలు.

ఒక యాఁడుకోఁతికి రెండుపిల్లలు కలవు. అందులోఁ జిన్నపిల్లయందు దానికి మిగులముద్దు. ఇట్లుండ వేఁటకుక్కలా కోఁతి నొకనాఁడు వెంటఁదఱుముచుండెను. ఆకోఁతి తన చిన్న పిల్లను గుండెకప్పుకొని పెద్దపిల్లమాట మఱచి పరుగిడుచుండెను. పెద్దపిల్ల తల్లివీపుపైఁ బ్రాకి యత్తుకొనియుండెను. అంతటఁ దల్లి కోఁతి తొందఱతో, బరుగిడుచుండ నొకపెద్ద మూదిరాయి దాని గుండెకడ్డము తగిలెను. అప్పుడా చిన్నపిల్ల చితికి చచ్చి క్రిందబడెను. పెద్దపిల్ల తల్లితోఁగూడ తప్పి బ్రతికెను.

గీ॥ తనదుపిల్లలంద । తీవిదల్లి యొకవొల్కి-(
జూడకుండునప్డు । కీడు(బొందు
కో(తితనదుపెద్ద । కూననెన్నక చిన్న
కొడమ వెంచిదాని( । గోలుపోదె॥

## 100. తోడేళ్ళు, జబ్బుతోనున్న గాడిదె

ఒక గాడిదె జబ్బుపడి చావున కెదురు చూచుచుండెను. ఆ మాట తెలిసి తో(డేళ్ళు దానిని( జూడగోరి యా గాడిదె పడి యున్న పంచయొద్దకు వచ్చి దానిపిల్లతో "ఏతల్లి నెమ్మదిగా నున్నదా!" అని యడిగెను, అది విని పిల్లగాడిదె "విన్నటికంటె నే(డు చాలా నెరవు" అని చెప్పెను,

గీ॥ ఒరులచావు(గోరి । యుండియు( జెవ(టులు
వగపుతోరవరయ । వచ్చుచుంద్రు
తెగులుపడినగాడి । దెను జూడ(దో(డేళ్ళు
తారుమారుకూర్మి । జేర(బోవె॥